శ్రీ

శ్రీమేధా దక్షిణామూర్తయేనమః.

# భక్తజనరంజనికీర్తనలు,

ఇయ్యాది. వెల్లటూరిగ్రామవాస్తవ్యుడును

మంత్రశాస్త్రప్రవీణుడునునగు

తంగిరాల - శేషయ్యాకవిచే రచియింపబడి

వెల్లటూరి గ్రామవాస్తవ్యులును. సంగీత సాహిత్యవిద్యా

ప్రవీణులును, చియ్యాళిరాజు, శ్రీరుక్మాం

గదమహారాజు, చరిత్రగ్రంథకర్తలును

శ్రీసాంబ్రాజ్యప్రదాయినీపత్రికాధి

పతులునునగు తంగిరాల

లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే పరిష్కరింపబడి.


చెన్నపురి

వ - ముకుందునాయుడువారి,

శ్రీగోపాలవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించిప్రకటింపబడెను,

మొదటికూర్పు - 1000 కాపీలు.

మార్చినెల - 6 లేది, 1911 సంll


Price ) Registered Copy Right. (As. 6

# ప్రకటన.



ఆర్యులారా.

మదీయవిజ్ఞాపనము



గుంటూరుజిల్లా తెనాలితాలూకా వెల్లటూరి గ్రామ వాస్థవ్యుడను మంత్రశాస్త్రప్రవీణుడను. నైజాంయిలాకా మంగలపల్లి గ్రామవాస్థవ్యులును, సకలవిద్యా ప్రవీణులును నగు స్వగురు శ్రీపూదుకంటి కృష్ణావధానిగారి ప్రియశిష్యుండగు తంగిరాల కేషయ్యగారిచే రచియింపబడిన భక్తజన రంజనియను యీగ్రంథమునందు ఆంధ్రకవనముతో వ్రాయబడి హరిహర ఆంజనేయ అంబకృతులను పెళ్లిపాటలను జావళిలను పెద్దలందరును చిత్తగించి సానోల్లాసముతో ఒప్పులు తప్పులన్నియు సవరించిగో చెదవు న్యాయముగానన్ను ధన్యునిజేయగలందులకు మిక్కిలి ప్రార్థించుచున్నాను.

ఇట్లు - విధేయుడు

తంగిరాల శేషయ్య.



3822
193

శ్రీ

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీమేధాదక్షిణామూర్తయేనమః.

శ్రీహయగ్రీవాయనమః.

# విఘ్నేశ్వర ప్రార్థనా.

రాగం - హిందూస్తాని కాఫి - చాపుతాళం.

౧. గౌరిపుత్రనిన్నునామది । గావుమనుచు వేడితి ।
గావుమనుచు వేడితి । నను గావుమనుచు వేడితి॥ గౌరి॥

౨. శౌరిసహోదరకుమార । జేసెదనీసేవర ।
జేసెదనీసేవర । నేజేసెదనీసేవరా॥ గౌరి॥

౩. జాలమింక యేలతంగి । రాలశేషయపాలక ।
రాలశేషయపాలక । తంగిరాలశేషయపాలకా॥ గౌరి॥

రాగం - జంఝూటి - ఆదితాళం.

శ్రీగణనాయక । వేగమెబ్రోవర ।
బాగుగనీపద । భక్తినేమరువను॥ శ్రీగణ॥

౧. నిక్కముసికునే । మ్రొక్కుచుపూజలు ।
జక్కగజేసెద । గ్రక్కునగైకొను॥ శ్రీగణ॥

౨. మురియుచుజగమెల్ల । దిరుగుచుదాసుల ।
కరుణతోజూచుచు । వరములొసంగర॥ శ్రీగణ॥

౩. గిరిజాప్రియసుత । సురమునిపూజిత
ధరణిలోశ్రీశ్వేత । పురపరిపాలక॥ శ్రీగణ॥

౪. వాసిగ తంగిరాల । శేషయకవినుత ।
ఆసజెందిలిరా । వాసవార్చితపద॥ శ్రీగ॥

## శ్రీ సరస్వతీ ప్రార్థన.

రాగం - హిందూస్థానికాఫి - అటతాళం.

వాణీ అలినీల । వేణిస్సైకత । శ్రోణీ అజురాణీ ॥
నను బ్రోవ ॥ వాణీఅలినీల॥

౧. లోపములను నెడ । బాపి యీసదయ ।
జూపవె ఓజననీ ॥ నా పాలి శ్రీ ॥ వాణీ॥

౨. పల్లవపాణిరా । యుల్లసల్లోకము ।
వెల్లిగ వేడెదను । వేడ్కతోను ॥ వాణీ॥

౩. శారదసినునే । కోరి వేడితినా ।
నేరములను నెంచకే॥ నీరజనేత్రి ॥ వాణీ॥

౪. శ్వేతపురవిహారిణి । శేషకవిపాలిని ।
పాతకసంహారిణి। భవాని ॥వాణీ॥

రాగం - జంఝూటి - చాపుతాళం.

అజుని రాణి నిన్ను మదిని । భజన జేసెద ।
నా మదిని । భజన జేసెద ॥ అజుని రాణి ॥

౧. సుజనపోషణి । నిను- నిజముగ నమ్మితి । త్రిజగద్రూపిణి ।
భుజగవేణి। విజయమొసగుమా॥ అంబ ॥ అజుని॥

౨. జాలిమేలనే । తంగి-రాల శేషయ । పాలినిపరాత్పరిబహు।
పాపసంహారి ॥ యంబ॥ అజుని రాణి॥



శ్రీకామేశ్వరీ దేవ్యైనమః.

## ఇష్టదేవతాప్రార్థన

ఇంగ్లీషుమెట్టు - చాపుతాళం.

కామశ్రీకామేశ్వరీమ్ । గావుముమామాహేశ్వరీమ్ ।
కామజనకసహోదరీమ్ । కల్యాణప్రదాయినీమ్ ॥ కామ॥

౧. సామజగామినీ । సరశిజలోచని । కామకోటిసుందరి ।
కౌమారిప్రియసతి ॥ శివెశివె ॥ కామ॥

౨. దోషహారిణీ । నిజ - దాసపోషణి । శేషయకవిపాలినివర ।
శ్వేతపురవిహారిణి ॥ వాసవార్చితే । వనజభవనుతే ।
ఈసరాజ్ఞికే । వాసిని । దాసుని । దోసములెన్నకవే ।
శివెశివె ॥ కామశ్రీకామేశ్వరీమ్ ॥

శ్రీ స ద్గు రు వే న మః.

## గు రు ప్రా ర్థ న.

రాగం - ముఖారి - ఆదితాళం.

గురువరనీపద । సరసిజములనెద । మరువగజాలర ।
మనవినివినవేర ॥ గురువ ॥

౧. భక్తిచేగురుపూజా । సక్తితోసల్పుటకు ।
యుక్తియునెరుగక । యుంటిపికప్రోవుము స॥ ద్గురు॥

౨. ధామునీదత్త్రాత్రేయా । ధాముదై మెగయిచున్న ।
పూరుకంటికృష్ణపరి । పూర్ణానందామూర్తియా॥గురు॥

3. స్థిరముగశ్రీశ్వేత । పురముననేలకొన్న ।
ధరశేషయాఖ్యుని ।ధన్యునిజేయుమన్న ॥ గ్గురువర॥

## సు క వి స్తు తి.

రాగం - పూరికళ్యాణి - ఆదితాళం.

౧. కొనియాడెద । సుకవులమదిని ॥ వినయముతోను ।
కునివాల్మీకిని।వనచరోత్తముని । వ్యాసాదిమునులనెల్ల ॥ కొని॥

క. అనఘుఁడున్నృసింహశాస్త్ర్యన ।
తనుసుబ్రహ్మణ్యుడనెడుకొమరుఁడుగలిగెన్ ।
మనమునసంతసమందుచు ।
వనజాక్షునిదలచెసుతుఁడువర్ధిలునటులన్ ॥

ఉ. శుభదినమందుతగ్గనుఁడు సొంపుగధామినిజననమొందగా ।
విభవముతోడ బ్రాహ్మణుల వేగమె తా బిలిపించి వేడ్కతో ।
యుబలునకప్పుడు నామకరణంబును జేసెను బ్రేమతోడుతన్ ।
సభయుసుబ్రహ్మణ్యుడని సర్వజనంబులుబిలిచిరయ్యెడన్ ॥

గీ. ఇటులకాలంబుగడుప ప్రబోధింపుగాను ।
బ్రహ్మచర్యంబునొంది సుబ్రహ్మణ్యుడంత ।
మంత్రశాస్త్రాదివిద్యల మర్మమెల్ల ।
నెరిగిపండితుఁడయ్యెను నీశుకృపను ॥

క. వేదంబునశాస్త్రంబును ।
మోదంబుగజదివిప్రాగ్ర్య పుణ్యఫలమున ।
న్సాధించెమంత్రవేత్తల ।
వాదంబులనెల్లగెల్చి కీర్తి లెభువిడెన్ ॥

వ॥ మరియు॥

క. పరిణయమును జేయఁగదల ।
చిరిసుబ్రహ్మణ్యునకును స్థిరహృదయుండై ।
కరిచర్మవసను రాణిని ।
సరగున బ్రార్థించె జనని జనకులు వేడ్కన్ ॥

వ॥ ఆసమయంబున॥

గీ. పరగనీభువి చినకళేపల్లియందు ।
వెలయు వెంపటి పల్లయ్యవిలసితముగ ।
భార్యవెంకమ్మవలన సంభావితముగ ।
గడపె గార్హస్థ్య మార్గంబు ఘనముగాను॥

క. అంతటనలుగురితనయుల ।
నింతులనైదుగురిగనియె నింపుదలిర్పన్ ।
చింతయులేకయెయిందఱ ।
సంతసమున బెంచెజనని జనకులువేడ్కన్ ॥

క. యీసుదతిపంక్తికంబులో ।
వాసిగసుగుణవతియనగసుబ్బమ్మయువేడ్కన్ ।
శ్రీసతివలెదాబెరుగుచు ।
భాసురసత్కీర్తితోడ బరగధరిత్రిన్ ॥

క. ధరణీసురబ్రహ్మణ్యుడు।
పరిణయమును జేసుకొనెను సుబ్బమ్మను వేడ్కన్ ।
కరిరాజవరదుకరుణను ।
వరసంతతిగలిగెపుత్రి వాంఛయుదీరన్ ॥

వ॥ అదెట్లనిన॥

సీ. వెంకటేశ్వరుకృపావీక్షణంబున గలిగె వెంకటాచలపతి వెలసెనొకడు । శేషశయనునిదయ విశేషంబుచే గల్గె శేషయ్యయుగమును జెన్నుమీర । కామకామేశ్వరికరుణచేనుదయించె కామయ్యయునుయింతఘనముగా త్రిపురసుందరిమంత్ర స్మరణచేజనియించె సుందరమ్మయు నెంతొ నందముగను వెలసెనరశింహామునుగూతులవిలసితముగ । ప్రాగ్భవమున నేమి నోచెనో పుణ్యజలము । సుబ్రహ్మణ్యముగనె సుతులసువతిగములు । ధరణిలోన కుమారుని శిరములనగా ॥

క. గలిగినసుతులనుసుతుల ।
విలసితముగ పెద్దగాను బెంచియుతనకిం ।
పలరగప్రియసతితోడను ।
అలతెరుక్రోశ్వేతశ్వరము నందుఘనుండై॥

వ॥ అంతకొంతకాలంబునకు॥

క. తనయులధరపైవిడచియు ।
జనకుడుజనెజింతదీర స్వర్గంబునకున్ ।

ఘనమైనతల్లిమిక్కిలి।
తనసంతతి మైనమమ్ము। తద్యాము బెంచెఁ॥

గీ. పెంచిపెద్దజేసి ప్రేమతో శుభకార్య।
ములనుమాకొనర్చి మోదమలర।
అంతవీరిలోన జింతదీరగ శేష।
కవియటంచునాకు గలిగెపేరు॥

సీ. బాల్యంబువిడవగా బ్రహ్మచర్యమునొందమాతండ్రి కృష్ణగదామహీని నరయు। బ్రహ్మచర్యమువదలి బరిణయంబునునొందమాతల్లికరుణైగా మహీనినరయు। కవితాప్రచారంబుగని వ్రాయనేర్చుటమద్గురుకృపయౌగా మహీనినరయు। మంత్రశాస్త్రమునుసమాశ్రయంబున గ్రహింపమాతండ్రి కరుణైగామహీనినరయు। రాజవైద్యంబును బాలపూజ్యతయును। గలిగిసుజనుల చేతను ఘనముగాను। స్తుతులనొందంగగలిగినశుభములన్ని। శరణశేఖరిదండ్రి సద్గురుకరుణగాదె॥

సీ. శ్రీరామునొకనాడుచిత్తమందుదలంచిగణనాథునకునమస్కారమొసగి శారదాంబనుమది సంస్తుతులనుజేసి గురువరు పదములగురినినిల్పి। కరుణతోలలితాత్రిపురసుందరనినేడ గొనియాడిసోదరజనుల ఘనతలెన్ని। వరభక్తజనులకు వందనంబులొనర్చి సుజ్ఞానులందునా మాటక్రొనిల్పి। శ్రీతినికృష్ణార్పణంబుగా గృతినిజేయు। దలచిహరిహరయంబకృతులను పెంచ్చి। పాటలనుజావళులనునే సూటిగాను। చెప్ప ప్రకటించితినిబుధుల్ చిత్తగింప॥



౨. భద్రముతో రామ। భద్రునిదలచుచు ।
నిద్రమరచిగురు। ముద్రనుజూడ ॥ కెందుకు॥

౩. మరువకమజిలో । మాధవనామము ।
మరిమరిదలచుచు। మధురముగ్రోల॥ కెందుకు॥

౪. ఆటలుపాటలు । బోటులకూటిమి ।
ఘూటనిఖేచరి । బాటమెరుగ ॥ కెందుకు॥

౫. యుక్తినిమంత్రా। శక్తినిగురుశ్రీ।
భక్తివిజ్ఞప్తిను। ముక్తినిదెలియ ॥ కెందుకు॥

౬. వాసిగశ్వేతపురీశతంగిరాల ।
శేషయకవిహృద!క్లేశమేశునిదలచ॥ కెందుకు॥

రాగం- మధ్యమావతి - అటతాళం.

రారశ్రీరఘురాఘవ । శ్రీరామచంద్ర॥ రా॥
రారశ్రీరఘురాఘువాయని । కోరిమదిలోవేడితినినా।
నేరమెంచతగదుతగదురా। నీరజలోచనభళిభళి ॥రా॥

౧. ప్రీతితోనినుకుశికసుతుడు । ఖ్యాతిగాదనవెంటగొనిచన ।
పాతకియౌతాటకనిద్రుంచి । దాతవైయాగంబునుగాచిన॥ రార॥

౨. ధాటిగయామౌనివెంబడి । బాటనడచిరాగరాతికి ।
సూటిగపాదంబుదాకిన । బోటిమైయాయహల్యనిలచెను॥ రారా॥

౩. యుల్లమలరగహరునివిల్లు। పెళ్లుపెళ్లునవిరచియంతట ।
పల్లవాధరిమైనసీతను । కొల్లగాపరిణయమునొందిన॥రార॥

౪. మాతపితరులవాక్యములను । ప్రీతితోగైకొనియువేగమె ।
సతినిసోదరువెంటగైకొని । నీతిగానడవికినేగిన॥ రారశ్రీ॥

౫. చుప్పనాతినిలక్ష్మణునికి । ఒప్పగించిముక్కుచెవులను।
తెప్పవనుగోయించిదనుజుల । దర్పమణచినరఘుకులోద్భవ॥ రా॥

౬. వాలినొక్కకోలనేసి। లాలితంబుగనలసుగ్రీవుని ।
నేలుకొమ్మనిరాజ్యమొసగివి। మేలుదారవని వేడుకొంటెసి॥ రార॥

౭. దండమగూర్చుకలంకలోపల । నుండురాక్షససైన్యములను ।
ద్దండకోపావేశములతో । చెండిశిరములజయమునొందిన ॥ రార॥

౮. దండమనగవిభీషణుని । నీ-అండిజేర్చుకరావణునికో ।
దండమూతో దశశిరములనుభువి । తుండెములుగనుగొట్టివేగమె॥

౯. సీతనప్పుడునగ్నిగుండ। జ్యోతిలోపలజొచ్చమనినెర ।
దాతవైబ్రోచుమనుబల్ప్ర । ఖ్యాతిగనునయోధ్యకేగిన ॥ రార ॥

౧౦. పట్టుగనుభువిరాజులందరు। పట్టణంబునలంకరించుగ'
చుట్టునిలచియుసురలుబొగడగ । పట్టభద్రుడవైశెలంగెడి ॥ రార॥

౧౧. వాసిగనుభువిస్వేతపురనీ। వాసవరశ్రీచన్నకేశవ ।
భాసురముగనుతంగిరాలు। శేషయాఖ్యుని నేలుదయతో ॥ రార ॥

రాగం - కరహరప్రియ - అటతాళం.

ఏలరననుబ్రోవపరా। కేలరాశ్రీపాలకా ।
నీలమేఘశరీరనినునే చాలనమ్మియుంటిరా ॥ ఏల॥

౧. దిక్కుడనునీపాదములపై । భక్తినుసువాజాలరా।
ముక్తిమార్గముబోపిసమని । భక్తవత్సలగావరా॥ ఏల॥

౨. కంససంహారవేగమేనా। హింసలనునెడబాపరా।
హంసవాహన। జనకెయిక నా। సంశయంబులదీర్చరా॥ఏల॥

౩. జ్ఞానహీనుడనగుచునేన। జ్ఞానములోబడియుంటిరా।
జ్ఞానమార్గమునెరుగబంప్పా। జ్ఞానమేదో జెల్పరా॥ ఏలర॥

౪. యిష్టముతోశ్రీపూరుకంటి। కృష్ణ దేశికవస్యలా।
యిష్టదైవమునుమదలచిన । కష్టములునెడబాయురా॥ ఏలర॥

౫. వాసిగశ్రీశ్వేతపురా । వాసశేషపుపాలకా ।
వాసవార్చితపాదచన్న । కేశవగోపాలకా ॥ ఏలర॥

రాగం - దర్బారు - అటతాళం.

చక్కనిశ్రీరామచంద్రా।నా- దిక్కు-నీవెరాఘవేంద్ర।
అక్కడక్కడనేని । చక్కనినామము ।
మక్కువతోవిని।మ్రొక్కుచుంటినిహరి ॥ చక్క॥

౧. చక్కనినీ సీతేశ రార। నా- చిక్కుల నెడబాపవేరా।
పక్కఁబొంచి తేలు । చక్కనికుడికాలు ।
విక్కఁగుట్టెను బాధ। మొక్కువారిమను బ్రోవు॥ చక్కని॥

౨. కన్నవారిని వేడవన్న। నీ- కన్నా నాకెవరున్నా। రన్నా।
నన్ని విధములానె। నిన్నె నమ్మియున్న ।
మెన్న డెరుగని బాధ । క్రన్నన బాపర॥ చక్కని॥

౩. యింతపంతమేలరా రా। నీ- చెంత జేర్చి బ్రోవవేర ।
నంతకంతకు నేనిన్। నెంతో వేడిన గావా ।
ఏంతజాగేల శ్రీ। కాంత నేలిన శౌరి॥ చక్కని॥

౪. నీగుణనడతల నెంచ। నే- నీరూపు జూపి వర్ణించ।
ఆగమపూజితనలవి మొఘువి నాకు ।
వేగవృశ్చికద్రష్ట । విషనిర్విషము జేయుము ॥ చక్కని॥

౫. వాసిగ శ్రీశ్వేతపురగ। నీ- వాస శేషయుకవిపోష।
వాసవార్చిత నేని। వాడనంటిని గావు ।
దాసజనపాలా। దశరథవరబాలా॥ చక్కని॥

రాగం - మధ్యమావతి - అటతాళం.

భిక్షము త్రితినాదు । శిక్షము నెడబాపి ।
అక్షయమును నివ్వరా। రామయ్య భిక్ష॥

౧. అక్షయకటాక్ష । అభిమానముంచినన్ ।
రక్షించరజగ - ద్రక్ష దానవశిక్ష॥ భిక్ష॥

౨. ఏలాజాలము శ్రీ । లోలా బాలగో ।
పాలసజ్జనలోలా । బాలుడ బ్రోవర॥ భిక్ష॥

౩. పాపములను నెడ । బాపియు నీదయ ।
చూపర నామీద । అపదోద్ధారక॥ భిక్ష॥

౪. వాసిగ శ్వేతపు । రీశా శేషయపోష ।
ధారుణముగ నిన్నె । బ్రస్తుతించెద హరి॥ భిక్ష॥

రాగం - ముఖారి - ఆదితాళం.

రామాననుబ్రోవు । పరంధామాననుగావు।
రామరామశ్రీ । రామాయనినే ।
నామదిలోనినే । వేమరువేడెద॥ రామానను॥

౧. కరుణతోదాసుల । మొరవినిబ్రోచెటి ।
బిరుదువహించిన దొరవనినమ్మితి॥ రామా॥

౨. అనుదినమునునా । మనమునదలచెద ।
ఘనముగనీవునా । మనవినివినుశ్రీ॥ రామా॥

౩. యిమ్మహినినునే । నమ్మినవాడను ।
సమ్మతిగనునభ । యమ్మునిమ్మురఘు॥ రామా॥

౪. ఆసతోనీకునే । దోశిలొగ్గినని ।
దాసులపాలిటి । దైవశిఖామణి॥ రామా॥

౫. జాలమేలతంగి । రాలశ్శేషకవి ।
నేలేవరములను । చాలగనొసగిన॥ రామా॥

రాగం - జంఝుటి - అటతాళం.

ననుబ్రోవరారశ్రీకృష్ణా । నేనినునెరనమ్మితినీరజనయనా॥ ననుబ్రోవ॥

౧. అనుదినమునునా । మనమునవేడెద ।
కనికరముంచినా । మనవిగైకొనరా॥ నను॥

౨. గోపికమనోహరా । పాపనికృపజూడు ।
కోపమేలరబాల । గోపాలవేగ॥ నను॥

౩. గోపాంగనలకెల్ల । గొబ్బునబ్రోచిన ।
ఆపదోద్ధారకని । నాశ్రయించితిరా॥ నను॥

౪. ధరదాసపరిపాల । వరవేణుగోపాల ।
మొరవినిరావెల । అరమరలేల॥ నను॥

౫. పావనచరితనీ । శేవజేసెదగావు ।
గావమున్ననీ । కన్నదికెవ్వరు॥ నను॥

౬. నీకంటెనాకెవరు । నిజముగలేరిందు।
రాకుంటెవిడువను । వైకుంఠవాస॥ నను॥

౭. స్థిరముగశ్రీ । శ్వేతపురమున నెలకొన్న ।
ధర శేషాయాఖ్యుని । మొరవినివేగ॥ నను॥

రాగం - ఫరజు - ఆదితాళం.

దేవానను బ్రోవరా। నీ శేవాజేసెదనను ।
గావరచిన్నికృష్ణ ॥ దేవా ॥

౧. నిత్యమునిన్నునే। స్తోత్రముజేసెదా ।
చిత్యాడననకను। ప్రత్యక్షమై వేగ॥ దేవా॥

౨. ఆశతోనీకునే। దోసిలొగ్గితిని ।
వేసారిననునీవు। గాసిబెట్టకుహరి॥ దేవా॥

౩. చక్కనితండ్రినిన్ను। మక్కువతోడనేను ।
నిక్కమునమ్మియు। మ్రొక్కెదవేగమె॥ దేవా॥

౪. వాసిగతంగిరాల। శేషయకవినుత ।
భాసురముగవాస । యాసదీర్చువేగ॥ దేవా॥

రాగం-హిందుస్తానికాఫి - ఆదితాళం,

రామానను బ్రోవవేమిరా। రఘురామా ।
ప్రేమాతో నేనునీ । నీనామము మరువజాల॥ రామా॥

౧. కరిరాజు మొరవిని । కరుణతో చక్రమంపి ।
సరగున మకరిని। శిరముద్రుంచినశౌరి ॥ రామా॥

౨. కాకాసురుడునీవు । కాల్లను బొడిచెనను ।
కాకామానివాని। గావాగలేదాహరి ॥ రామా॥

౩. నీనామముతోడను। నీదాసజనులు।
వేమరువేడగ । ప్రేమతో బ్రోచినశ్రీ॥ రామా॥

౪. అంజనిసుతునకు । రంజితముగపద ।
కంజములొసగిన । కనకాంబరధర ॥ రామా॥

౫. రక్షించెదవనినా। కుక్షిలోనమ్మితి।
పక్షపాతమేల। పక్షివాహనశౌరి॥ రామా॥

౬. శ్రీశశ్రీతంగిరాల। శేషయకవిమెడ।
తోసములెన్నకు। దాశరథిహరి॥ రామా॥

రాగం - హిందుస్థానికాఫీ - ఆదితాళం.

మరువకవేమానసా। నిరతము శ్రీహరిచరణసేవ॥ మరు॥

౧. పాపకర్మములు పైబడకనునీ।
పాపములనునెడ। బాపుహరిని॥ మరు॥

౨. సత్యముజ్ఞానియు। సత్యముమానియు।
సత్యవేదాంతుల। నిత్యశేవ॥ మరు॥

౩. నిత్యము శ్రీహరి। నిజదాసులకును।
భృత్యుడవైమన। బిసరుహాక్షు॥ మరు॥

౪. ఎందుకుయీభ్రమ। లెందుజెందెదవు।
పొందుగశ్రీముచు। కుందవరదు॥ మరు॥

౫. దాతకృష్ణవ। ధూతశ్రీసద్గురు।
ప్రీతితోజెప్పిన। ప్రియవాక్యము॥ మరు॥

౬. వాసిగశ్వేతపు। రీశతంగిరాల।
శేషయవరదుని। చరణభక్తి॥ మరు॥

రాగం - బిలహరి - చాపుతాళం.

రామానను బ్రోవరా। నీలమేఘశ్యామానను గావరా।
రామరామశ్రీరామయనుచునె। నేమరుననేనీమముతోనీ।
నామమధురామృతరసంబును। ప్రేమతోమదిగ్రోలుచుంటిని॥ రామానను॥

౧. దీనునిమొరవినరా। రామయ్యనీదివ్యరూపముజూపరా।
దీనజనులనుబ్రోచెదవుయని। దిక్కునీవనివేడుకొంటిని।
గానలోలకృపానిధేసు। జ్ఞానరక్షకగరుడవాహన॥ రామా॥

౨. పలుమారునిను వేడగ శ్రీరఘురామా । పలుకావున్నావేమిరా ।
అలుకలేలరకులుకు గానోక । పలుకుపలికినాముందునిలచియు।
కలుషములనేడబాపి బ్రోవుము।కనక చేలకు చేలపాలన॥రామా॥

౩. గతినీవేయనియుంటిరా కరివరదానే । మతిహీనుడనంటిరా ।
హితవుతోసద్గతియుజూపర । నితరులను నేవేడజాలర ।
పతితపావననామ నేనీ । పాలబడినబాలుడను శ్రీ॥ రామా॥

౪. ధర శ్వేతపురపాలకా కరుణాత్మక । వర శ్రీచెన్నకేశవా
స్థిరముగనుమదితంగిరాల । శేషకవి ప్రార్థింపభక్తుని ।
సరగునను బ్రోచుటకునీమది । కరుగ వేమిరకంజలోచన॥ రామా॥

రాగం - భైరవి - రూపకతాళం.

కరుణించర । కరుణానిధే । నెరనమ్మిన । వరభక్తుడ॥ కరు॥
అరమరయిక నెలనునా । మొరవినినీదరిజేర్చుము ॥ కరు॥

౧. సుందరాంగవాసార్చిత । మందరగిరిధరముకుంద ।
నందునినందననామొర । వెందుకువినవిందిరవర॥ కరు॥

౨. మధుసూదననీనామము । మరువనునిటుదయచేయుము ।
విధుసమవదనప్రకాశ । సదమలమృదుపదసత్తము॥ కరు॥

౩. ధర శ్వేతపురనివాసక । శరణాగతజనరక్షక ।
ధర శేషయకవిపాలక । హరివంశాంబుధిశశాంక॥ కరు॥

రాగం - మోహన - అటతాళం.

రావయ్యా శ్రీరామచంద్రా । నన్ను గావవయ్యా రాఘవేంద్ర॥శ్రీవరనన్నునీ ।
సేవకునిగజూడుపావనచరితనీ । పదములెనమ్మితి॥ రావయ్యా॥

౧. అందముగనునీ । విందురారగో ।
విందముకుందనె । వందనమొనరింతు॥ రావయ్యా॥

౨. ఘట్టిగనేనునీ । పట్టుజేరితినింక ।
రట్టుజేయక । జేపట్టిరక్షించుము॥ రావయ్యా॥

౩. జాలమేలరనింక పాలకడలిశయన ।
బాలుడనేనుగో । పాలనమ్మితిచాల॥ రావయ్యా॥

౪. శ్రీశతంగిరాల । శేషయాకవిపాల ।
గాసిబెట్టుటమేల । కనకాంబరచేల॥ రావయ్యా॥

రాగం - సురట - ఆదితాళం.

మెరుగనివాడనురా । నీగుణములు మెరుగనివాడనురా॥

౧. మెరుగనివాడను । నిరతముగ నన్నీ ।
చరణకమలభక్తి । మరువకుండెడుగతి॥ మెరు॥

౨. పరిపరివిధముల । మొరలిడుచుండిన ।
కరివరదాయక । కరుణించేదవనీ॥ మెరు॥

౩. దంతివరదనీ । చింతనజేయుచు ।
వంతు కెక్కుటకు । అంతరంగభక్తి॥ మెరు॥

౪. చక్కనిమోమును । సరగునగనుటకై ।
పక్కజేరుటకు చక్కనిమార్గము॥ మెరు॥

౫. మధుసూదననా । మదిలోపలనీ ।
పదయుగములపై । భక్తినిలుపుటకు॥ మెరు॥

౬. దోషరహితనల । శేషయాకవినుత ।
శేషశయనవి । దోషములనుమది॥ మెరు॥

రాగం - హిందుస్తాని భైరవి - ఆదితాళం.

రామపావననామ । రఘుకులసోమ । ప్రేమను నేలుమా॥

౧. రామశ్రీపరంధామసద్గుణ । స్తోమమోక్షప్రదాయక ।
పామరత్వము బాపుటకు యింత । తామసంబిక నేలర శ్రీ॥ రామ॥

౨. రామనిను నెరనమ్మియుంటిని । వేమరును మది వేడుకొంటిని ।
కామితార్థములియ్యుమంటిని । గాచి నను రక్షింపుమంటిని ॥ రామ॥

౩. వాసవార్చితపాదరజితగి । రీశనుతనను గావుమా మొగి ।
దాసజనులకు దారినీవని । నాశజెందితి శ్రీశ జగదధి॥ రామ ॥

౪. చాలగా నిను నమ్మినాడర । బాలుడను దయజూచి బ్రోవర ।
కాలహరణము జేసితే మిక । తాళజాలసి వేళను ॥ రామ॥

౫. శ్రీరమేశతంగిరాల । శేషయాఖ్యుడుజేయు శేవల ।
గౌరినీదరిజేర్చివరముల। పారమొసగుము రానివేళ శ్రీ॥ రామ॥

రాగం - హిందూస్థానికాఫి - ఆదితాళం.

హరియిందువేగరారా। మొరవినిబ్రోవర ।
నరమరసేయకుర। నెరనమ్మినానురా॥ హరి॥

౧. కరుణతో ప్రహ్లాదుని । గాచితివనివిని ।
సరగుననిన్నెమదిని। శరణనివేడితి ॥ హరి॥
౨. అరమరింకేలనురా। యఖిలలోకాధారా ।
స్థిరముగనీదుపద। చరణముల్ నిల్పితెద॥ హరి॥
౩. వరయిష్టయోగానంద। నరశింహానేనీభక్త ।
పరుడనుగాననాతో। బలుకనుపంతమేల ॥ హరి॥
౪. పరగగ శ్రీచోడయ । పాలేమునందున ।
కరమరదుగాలక్ష్మి । కాంతతోగూడిన ॥ హరి॥
౫. పోషితామరస్వేతా । పురవరతంగిరాల ।
శేషయాఖ్యునిశేవ। జేకొనుముమాయన్నా॥ హరి॥

రాగం - సురట - అటతాళము.

రామునిమరువకవె । ఓమనస శ్రీ। రామునిమరువకవే॥

రామునిమరువకు । పామరులజేరకు।నీమదిభద్రాద్రి। నిలయుండగుసీతా॥

౧. పాపపుపనులకులో । బడిచెడిమోహ ।
కూపములోబడకే। వేపారములువేల ।
వేయివేలధనమేల। ఆపదలనునెడ। బాపేటిజగదభి॥ రాముని॥
౨. నిరతముసద్గురునీ । చరణసేవ । మహావకజేయుచును ।
కరుణవడసియునీవు। కడతేరుమార్గము ।
సరగునగనుగొను। సమయమిదెరఘు॥ రాముని ॥
౩. సరగునమహానీయుల। సద్గోష్ఠిలోచేరికోరికలలర ।
విరివిగాయానంద । వాక్యములనువిని ।
వారిదప్పకకడ । తేరవేదశరథ॥ రాముని ॥

౪. పట్టువాదములేలనో । వెఱ్ఱిమనసా ।
ఘట్టిగా గురుపాదము। బట్టిగురుమండలిలో।
గొట్టినభేరిని । గుట్టుదెలసుకొనవే। గురిచిల్పిపట్టాభి॥ రాము॥

౫. నరజన్మమందుననె। నరహరిని । పరికించిగనవలెనె।
దొరుకదుటేజన్మము । దుస్తరమేమనసా ।
అరసిగనుగొనవె । అతివేగనయోధ్య॥ రాముని॥

౬. స్థిరముగధరశ్రీశ్వేత । పురమందున ।
వరచన్నకేశవుని । చేరితంగిరాల ।
శేషయకవిహృదయమే। శ్వరునిదలచవెనితర। స్మరణేలకోదండ॥రా॥

రాగం - జంఝూటి - ఆదితాళం.

రారరాఘవమొరవిని । వేగరారరాఘవ ।
యేరా - ధీర - నేరా - మెన్నకవేగరారా॥

౧. నేరమానను బ్రోవనీకు । భారమాగౌరీశమిత్రా।
సారసలోచననిన్నే । చాలనమ్మియుంటి ॥ వేగరార ॥

౨. కరిప్రహ్లాదులగాచినట్టి। బిరుదునీకేయనివింటి ।
సరగునన్నుబ్రోవుమంటి । సేవకుడనంటి ॥ వేగరార ॥

౩. వింటినినీమహిమా నేనా । రింటిలోనజిక్కియుంటి ।
కంటకమికమానుమంటి। కరుణజూడమంటి॥ వేగ॥

౪. చలగుచుధరతంగిరాల। శేషకవిపరిపాల ।
పలుమారునినువేడజాల। బృందావనలోల॥ వేగ॥

రాగం - బిలహరి - రూపకం.

వీరరాఘువవేగమేనా। వెతలుమాన్పవిదేలరా ।
వారివీరినివేడజాల । రారామాధవా॥ వీర॥

౧. కాలునిభయముమాలదీర్చి । గావనీవెనంటిరా ।
నీలవర్ణనీముద్దుమోము । నెలమితోనికజూపరా॥ వీర॥

౨. కరివరుద్రౌపదిహల్యను । గాచినబిరుదేదిరా ।
తరుణమిదే బ్రోవరబే । దశరథాత్మజా॥ వీర॥

౩. పశుపతినుతవేనునీ । భజనమరువజాలరా ।
దోసిలొగ్గివేడిననా । గాసిమాన్పవేమిరా ॥ వీర॥

౪. పలుమరునిను వేడజాల । బాలునిదయతాడర ।
కాలహరణమేలారారా। గానలోలాజాలమేలా ॥ వీర॥

౫. దోషరహితతంగిరాల । శేషయాఖ్యపాలకా ।
శేషశయనబ్రోవరనేసి । శేవజేయుచుంటిరా ॥ వీర॥

రాగం - హిందూస్థానితోడి - అటతాళం.

రామాబ్రోవరా। రఘుకులసోమగావరా। శరణంటినిశ్రీరా॥ రామ॥

౧. ఏమానందురా । నీమహిమనెరుగనివాడరా । నీరజనేత్ర॥ రామ॥

౨. వేమారువేడితిరా। తామసమేలరా। కోనులాంగనా। కోరికదీర్చరా॥

౩. వేయువిధంబులా। వేడగజాలరా। దయజూడవేమిరా।
దనుజసంహర్తరా ॥ రామా॥

౪. కోపముయేలరా । కోరినవాడరా ।
జూపునీముద్దుమోము । జూడనెగోరినార॥ రామా॥

౫. సామగానలోలా । సరగునబ్రోవనేల ।
ప్రేమజూపరా । పరమపురుషా॥ రామా॥

౬. శ్రీశతంగిరాల । శేషయకవిపాలా ।
భాసురస్వేతాపూర । వాసదాసపోష॥ రామా॥

రాగం - ధన్యాసి - ఆదితాళం,

రామునిదలచనివారికి యమబాధరయమునగలుగునుఓరన్నా
ప్రేమతోశ్రీహరినామమునుడివిన । వారియురయమబాధలోరన్నా॥రా॥

౧. గురునిగురునిగుర్తెరకక్రముసుపె । గురునిగురునిగుర్తెరగవలెక్ ।
ఆరుమతంబులదెలియకమునుపేహరిగురుధ్యానముజేయరోరన్నా॥రా॥

౨. మాయలుమంత్రములెంత్రతంత్రముల్ । మదిలోవలచకురోరన్నా ।
మాయసఖాప్త్రులత్ఖుద్రవిద్యలక్ । మరచుటమంచిదిరోరన్నా॥ రామ॥

౩. పట్టగరానిదిపట్టితెమరలా । గుట్టుమేమియులేనిది ।
పట్టదుపుట్టదుకొట్టదుగిట్టదు । యిట్టిభావమికనెరుగరోరన్నా॥ రామ॥

४. మూడువేర్లనూగలశినచోటగురు । మూర్తుగనవలెరోరన్నా ।
తడబడకమసహస్రారమందునున్న । తల్లిగనవలెరోరన్నా॥ రాముని॥
౫. దాతకృష్ణవధూతశ్రీసద్గురూ । నీతిజెప్పినజ్ఞానమన్నా ।
పాతకములనెడబాపిహరిమెసం । ప్రీతితోమోక్షమొసగురోరన్నా॥
౬. కాశియాదిగాకల్గుయాత్రలు । జేసితిరిగినాఫలమేమన్నా।
వాసిగ శ్వేతపురీశతంగిరాల । శేషయవాక్యమిస్థిరమోరన్నా॥ రాము॥

రాములవారిపూజ.

రాగం - ఫరజు - ఆదితాళం.

పూజాజేతామురారే । ఓ పుణ్యాత్ములారమల్లె ।
పూలాతో శ్రీహరికి॥ పూజా॥

౧. అందముగనుమన । మందరమునుగో ।
విందునిడెందమున । నందమునొందనేడు ॥ పూజా॥
౨. తేజరిల్లేకిగజ । రాజవరదునకు ।
రోజాచామంతివిర । జాజీసంపెంగపూల ॥ పూజా॥
3. నీలవర్ణునిమెడ । మేలైనబొడ్డుమల్లె ।
పూలాహారాముచేశి । వాలాలాడగనేడు ॥ పూజా॥
४. వాసిగతంగిరాల । శేషయకవిహృద ।
యేశునిపాదములకు । కేశవనామములతో ॥ పూజా॥

—(*మంగళహారతులు.*)—

రాగం - ఫరజు - ఆదితాళం.

హారతులివ్వారారె । ఓ యలివేణులారశ్రీ।హరికినిమంగళం॥హార॥

౧. కూరిమితోమన। కువలయనేత్రుని ।
కోరిభజించుచు। కొనియాడుచూనుజయ ॥ హారతు॥
౨. యల్లమురంజిల్ల । నల్లనయ్యమెడ ।
మల్లెపూలదండ । కొల్లాగవేసిజయ ॥ మంగళం॥
3. రంగుగమదిను । ప్పొంగగమనసుచే ।
లంగగహరికిని । బంగారుపళ్లెమూల ॥ హారతు॥

౮. భాసురముగనల । శేషయువినుతుఁడౌ ।
వాసిగ శ్వేతపురీ । రీశునకుకర్పూర ॥ హారతు॥

రాగం - సురట - అటతాళం.

మంగళంమంగళం । మాధవనీకు ॥ మం॥

మంగళకరమగు।మహనీయగుణతేజ। రంగగుదశరథరాజకుమార రా
బంగారుతండ్రినీ । భక్తుడనంటినీ ।
శృంగారమగుమోముజూపర శ్రీరామా ॥ మంగళం॥

౧. ఘనమగుకౌసల్య । గర్భమందునబుట్టి ।
మునివాక్యములవీని । ముదముతోనీవు ।
చనుడెంచితాటకినీ । సంహరించియుయాగ ।
మునుగాచినట్టిశ్రీ । ముద్దులశ్రీరామా ॥ మంగళం ॥

౨. కరముచేహరివిల్లు । విరచిశ్రీజానకినీ ।
పరిణయమొందిన । బలుడవునీకా ।
పరశురామునిభంగ । పరచినుస్థిరముగ ।
కరుణతోసుజనుల । గాచినశ్రీరామా ॥ మంగ ॥

౩. కైదరకైకదశ । రథునితోరాముని ।
పదునాల్గేండ్లడవికి । బంపేటివరమనగా ।
మెదలకసీతాసౌ । మిత్రులగూడుకొని ।
మదిచేదరాకడివికి కదలినశ్రీరామా ॥ మంగ॥

౪. చాటుననిలచియు । సంధించిబాణముల్ ।
ధాటిగావాలినిధరణిపైగూల్చి । మేటియౌకపివరుల ।
తోటిచనుదెంచియు । నీటిపైవారధినిల్పినశ్రీరామా॥ మంగ॥

౫. పాటిల్లుయాలంక । పురమందుజొచ్చియు।
కోటిగాతుసులానిగోటమీటియూ। సూటిగరావణుని।
శిరములగూల్చియు । సీటగలపినబల్ నిపుణుడౌశ్రీరామా॥ మంగ॥

౭. అంగదసుగ్రీవ । హనుమంతాదులుబల్చె ।
లంగుచుగొలువమునిపుంగవుల్ వేడ । చెంగటజానకినీ ।
జేర్చుకయోధ్యకు । ప్పొంగుచుజేరినభూపాలా శ్రీరామా॥ మంగ॥

౮. చలగుచుభరతంగి । రాలశేషయకవిపాలభక్తనుకూల ।
పాపసంహార। మేలుకర్పురహార । తూలనాసగదవేగ॥
కోలాహలముగాగ్రై । కొనుమికశ్రీరామా॥ మంగళం॥

శ్రీ హ రి ధ్యా న - కీ ర్త న లు.

స ం పూ ర్ణ ం.





## శ్రీశివధ్యాన కీర్తనలు.

రాగం - జంఝూటి - ఆదితాళం.

యీశ్వరాసర్వేశ్వరాజగ । దీశ్వరామాహేశ్వరా ।
శ్రీశ్వేతాపురివరయగ । స్వేశ్వరాపరమేశ్వరా॥ యీశ్వరా॥

౧. ఫాలలోచనుడసకల । పాపసముదాయక ।
కాలాహరణమేలనేనీ । పాలాబడినవాడరా॥ యీశ్వరా॥

౨. బాగుగనీమృదుపద । యుగముతెనెరనమ్మితి ।
నాగచర్మాంబరధర । జాగేలశివశంకరా॥ యీశ్వరా॥

3. తంగుగనామదినిను । ప్పొంగుచునినువేడెద ।
గంగాజటాజూటాధరనీ । చెంగాటననుజేర్చరా॥ యీశ్వరా॥

౪. అందముతోడనీకు నే । వందనముజేసెద ।
యిందురావదేర త్రిపురా । సుందరీమనోహరా॥ యీశ్వరా॥

౫. వాసిగానుతంగిరాల । శేషకవిపోషకా ।
భాసురముగ స్వేతాపురనీ । వాసదాసపోషకా॥ యీశ్వరా॥

రాగం - ఫరజు - ఆదితాళం.

శంకరననుబ్రోవర । ఓపంకజలోచన । సంకటములబాపి॥ శంక॥

౧. మక్కువతోడనిన్నె । నిక్కముదలచెద ।
చక్కనిగౌరీశ । గ్రక్కునరారాశివ॥ శంకర॥

౨. రక్షించెదైవమనా। కుక్షిలోనమ్మితిని ।
అక్షయకటాక్షు । మతిశీఘ్రముగనెంచి॥ శంకర॥

౩. నందివాహనా । వందనములనీవు ।
పొందుగగైకొన । యిందురావేలశివ॥ శంకర॥

౪. ధరణిలోచిన్నాయ । పురమునవెలకొన్న ।
కరుణతోసిద్ధేశ । గావుముమహేశ॥ శంకర॥

౫. వాసిగస్వేతాపుర । వాసుడవౌఅగ ।
శైవశేషయకవి । పోషాత్రిపురహర॥ శంకర॥

రాగం - కమాచి - ఆదితాళం.

హరా। నామొరవినరా । కైలాసవాసా హరా।
గౌరీశాసన్నుత। కరుణతోగావర॥ హరా॥

౧. ధరణినిదాసుల । దనరగనేలెడి ।
బిరుదునీదెయని । మొరలిడుచుంటిని॥ హరా॥

౨. ఏమియునెరుగని । పామరుడనునాపై ।
తామసమేలర । ప్రేమతోబ్రోవర॥ హరా॥

౩. నిరాధారుడ । నినునెరనమ్మితి ।
మొరాలకించర । బిరాననీవేళ॥ హరా॥

౪. కరుణతో చావలి । పురమున వెలశిన ।
వరవాలేశ్వర । వరములొసంగర॥ హరా॥

౫. యీశ శ్రీ శ్వేతపు । రీశుడవాయగ ।
స్త్యైశ్వరతంగిరాల । శేషయపోషక॥ హరా॥

రాగం - ముఖారి - ఆదితాళం.

శంకరపురహర । శరణుజేసెదనురి ।
సంకటముబాపర । సమయమిదేర శివ॥ శంకర॥

౧. నిరతమూనీపద నీరజములనెడ ।
మరువజాలర । మదనగర్వహరణా॥ శంకర॥

౨. అనుదినమికనునా । మనమున వేడెదను ।
యినశశినయననా । మనవినివినుశివ॥ శంకర॥

౩. చోడేశ్వరగౌరి । తోడనుగూడికొని ।
చోడయపాలెమందు । జోకతోడుతనుండు॥ శంకర॥

౪. శేషభూషణవర । శ్వేతపురవిహారా ।
పోషితతంగిరాల । శేషయభక్తవరద॥ శంకర॥

రాగం - కరహరప్రియ - అటతాళం.

ఏలరానను బ్రోవనికజా । గెలరాము క్తేశ్వరా।
ఫాలలోచనరారనేనీ । పాలబడినవాడరా॥ ఏలరా॥

౧. పలువిధంబులనిన్నె నామది । ప్రస్తుతించుచునుంటిరా ।
కలుషములనెడబాపిబ్రోవర । గరళకంఠపరాత్పరా॥ ఏలరా॥

౨. గౌరినాథానాదుపైని । కరుణజూపవదేలరా ।
శరణుజేసెదరారశ్రీశివ । శంకరాత్రినేత్రకా॥ ఏలరా॥

౩. గంగాజటాజూటధరనీ । చెంగటనునను జేర్చరా ।
రంగగూనీనామమెన్నక । పొంగుచునుస్మరియించెదా॥ ఏలరా॥

౪. కోపమేలరనీదుమోము । జూపరామహేశ్వరా ।
పాపసంహార్వరరారవెల్ల । టూరుశ్రీఅగస్త్యేశ్వరా॥ ఏలరా॥

౫. మేలుహారుడవుయనుచుని న్నే । చాలనమ్మియుంటిరా ।
చలగుచునుధరతంగిరాలా । శేషయాఖ్యను తేశ్వరా॥ ఏలరా॥

శ్రీ శివ ధ్యాన - కీర్తనలు.

సంపూర్ణం.





## శ్రీఆంజనేయధ్యాన కీర్తనలు.

రాగం - హిందూస్థాని కాఫి - చాపుతాళం.

సుందరఆంజనేయ వందనముచందనము ।
సందియమేలగో । విందుని పాదార్చిత॥సుందర॥

౧. నీవని నేనమ్మితి । భావములోసదా ।
శేవలుగైకొని । గావరవేగమి॥ సుందర॥

౨. వనమునసీవునా । ధనమనినమ్మితి ।
వనచరోత్తమూలలో । ఘనమువహించిన॥ సుందర॥

౩. లంకకేతించిసుర । కింకరులనుద్రుంచి ।
సంకటమాన్పసీత । సరసకుచేరిన॥ సుందర॥

౪. ముదమొదవగవా । హృదయమునందున ।
పదయుగముల శేవ । వదలక జేసెద॥ సుందర॥

౫. విరివిగకొండపల్లి । గిరిపైనెలకొన్న ।
వరఆంజనేయవేగ । వరములనొసగర॥ సుందర॥

౬. వాసిగస్వేతాపురి । వాసుడవగుచును ।
[illegible] । శేషయాఖ్యునిబోచె॥ సుందర॥

రాగం - హిందుస్థానికాఫి - చాపు.

వీరాంజనేయనిన్ను। వేడెదనన్నుబ్రోవు।
శ్రీరాముపాదార్చిత। శ్రితజనపోషక॥ వీరాంజ॥

౧. బాగుగరామునకు। సాగిలిమ్రొక్కియు।
వేగమెలంకకు। నేగినమహాబల॥ వీరాంజ॥

౨. రామునిలక్ష్మణుని। నీమములన్నియు।
వేసురుజానకికి। ప్రేమతోదెల్పిన॥ వీరాం॥

౩. సురరిపులుజెదర। దిరుగుచులంకలో।
బోరిగొనిరాక్షసుల। ధరగూలనేశిన॥ వీరాం॥

౪. అరమరలేకలంకా। పురముసుగాల్చియు।
సరగునశ్రీరాముని। సన్నిధిజేరిన॥ వీరాంజ॥

రాగం - మధ్యమావతి - అటతాళం.

రారావేగ। శ్రీరామదూత। రారావేగ। రారారామునిచెంత
చేరిగొలచుచున్న। ధీరమహాబలాదీనుడానుబ్రోవ॥ రారా॥

౧. పాటిల్లశ్రీహరి। పాదసేవకుడవై।
మేటిలంకాపురి। సీటగలిపినధీర॥ రారా॥

౨. కోటికెదిరించిన। మేటిరాక్షసులను।
గోటమీటిధర। గూలనేశినసూరా॥ రారా॥

౩. మోదమానీముద్దు। మోముజూపరవేగ।
వాదమేలరదేవా। వనచరోత్తమగావా॥ రారా॥

౪. ధరశ్రీమల్లవల్లి। పురపరిపాలక।
వరవీరాంజనేయా। వరములనొసగర॥ రారా॥

౫. కోపమేలరవాయు। కోమరనీనిజ।
రూపముజూపర। కూపనీవేశకా॥ రారా॥

౬. బాలుడనునేనీ। పాలబడితిని రావ।
దేలరాఘరతంగి। రాలశేషయువినుత॥ రారా॥

రాగం - కరహరప్రియ - అటతాళం.

వాయుసుతా రారనేనీ । వాదనంటిని గావరా ।
వేయువిధముల వేడజాలర । వేగననుకరుణించరా ॥ వాయు ॥

౧. యిందురమ్మని వేడనీమది । సందియంబూ లేలరా ।
అందమగు శ్రీరాము పాదర । విందసేవ పరాక్రమా ॥ వాయు ॥

౨. రాముకార్యధురంధరానీ । రాక కెదురుజూచెద ।
రాముని శెలవందివేగ । రారమొరయాలకించర ॥ వాయు ॥

౩. దీక్షబూన నేగిసంజివి । దెచ్చి శ్రీరాముకిచ్చియూ ।
తక్షణంబునలక్ష్మణునిసం । రక్షణంబు జేసితౌ ॥ వాయు ॥

౪. మేటిదనుజుల నెల్లబట్టినీ । గోటమీటి వేసితౌ ।
కోటిరిపులనుగొట్టిధరనూ । గూలనేసినవాడవౌ ॥ వాయు ॥

౫. స్థిరముగను శ్రీశ్వేతపురమున । కరుణతో వెలశితివౌ ।
పరమభక్తపిరాలజనేయనీ । భజనజేయుచుంటిరా ॥ వాయు ॥

౬. జాలమేలా రారతంగి । రాలశేషయపాలకా ।
చాలనమ్మియున్న నేపసి । బాలుడనుకరుణించరా ॥ వాయు ॥

శ్రీ ఆంజనేయ ధ్యాన - కీర్తనలు.

సంపూర్ణం.





## పరదేవిధ్యాన కీర్తనలు.



రాగం - దర్బారు - అటతాళం

అంబానన్నుబ్రోవవే । చక్రనిశారదాంబానన్నుగావవె ।
అంబాఓకనకదు । ర్గాంబ త్రిపురాంబజగ ।
దంబావినవేనుమో । దంబుతో వేడెద ॥ అం॥

౧ ఓంకారిహ్రీంకారి । క్లీంకారిశ్రీశివ ।
శంకరివేగనా । శంకమాన్పవెతల్లి ॥ అంబా॥

౨. మకుటవతోనేనీ । చక్కనిపాదములె ।
దిక్కనివేడిన । దివ్యస్వరూపిణి ॥ అంబా॥

౩. వేడుకతోవిజయ । వాడశ్రీగిరిస్థైని ।
వాడిమీరగభక్త । పాలనజేయుచు ॥ అంబా॥

౪. వాసిగశ్వేతపు । రీశునిరాణివై ।
భాసురముగభక్తపరు శేషకవినేలు ॥ అంబా ॥

రాగం - ముఖారి - ఆదితాళం.

దేవీనన్నుబ్రోవ । పర - దేవిజాగేలా । దేవిదేవినా ।
భావములోపల । నీవనినమ్మెద । శేవలుగైకొని ॥ దేవినను॥.

౧. మరువకనినునె । నిరతముగొలచెద ।
కరుణతోనీవునా । మొరవినివేగమె ॥ దేవి॥

౨. దాసునిమదిలో । ఆశలుదీర్చుచు ।
వాసికెనెక్కిన । వరకామేశ్వరి ॥ దేవి ॥

౩. పంతమేలనే । నెంతనివేడుదు ।
చింతదీర్చిసీ । చెంతనుజేర్చవె ॥ దేవి॥

౪. శ్వేతపురంబున । ప్రీతితో వెలశియు ।
ఖ్యాతికెనెక్కిన । పాతకనాశని ॥ దేవి॥

౫. భాసురముగనల । శేషయకవినుతే ।
దోసములెంచకె । దాసులయెడలను ॥ దేవీ॥

రాగం - దర్బారు - అటతాళం.

హరిహృదయేశ్వరీరావె । నా - మొరవినివేగబ్రోవవె ।
హరిహృదయేశ్వరియఖిలలోకధారి । శరధివరసుకుమారి ।
చంద్రసహోదరి ॥ హరి ॥

౧. వరలక్ష్మినీనిజరూపు । నా - కరుణుదీరగకండ్లజూపు ।
పరులవేడకనీదు ప్రాపు । బడయజేరితినీదుదాపు ।
దురితసముదాయములబాపు । కొరతలన్నిటియేవుమాపు॥ హరి॥

౨. లేమూలనెడబాపజేసి । నా - నోమూసఫలమౌనటులజూచి ।
కామితార్థప్రదాయినివైనౌ । గాచినసురక్షించుమేటివై ।
నీమహాత్మ్యమునెంచిబోగడగ । నెవరితరమిద్ధరణియందున ॥ హరి॥

3. ధనలక్ష్మినినే నమ్మియుంటి । నా - మనమునవేడుకొనుచుంటి।
కనికరముమదిబూనినాపై । కపటమునకుగావుప్రాపై ।
ఘనగానమునమ్రేవలసగై । కొనుముభక్తవత్సలునకింపై ॥ హరి ॥

౪. చాలూనిదయజూడమంటి । నీ - పాలబడినవాడనంటి ।
జాలమికసేయకుముతంగి । రాలశేషయజేయునీకృతి ।
పాలనముజేసేటిమేటివి । పాలకడలిగారాముపట్టివి ॥ హరి ॥

రాగం - దర్బారు - అటతాళం.

త్రిపురాసుందరియిందురావె । నా-నెపములెన్నకనుబ్రోవావే ॥

౧. చపలచిత్తుడనాశికృష్ణుడకుపితుడ ।
యపరాధినననినాపై । నరమరశేయక ॥ త్రిపురా॥

౨. నందివాహానుచెంతజేరి । బ్రంహ్మానందామొందుచునుందుతరి।
సుందరేశ్వరినీదు । యందామౌచరణార ।
విందాములకునునే । వందానమిడెదను ॥ త్రిపురా॥

౩. పామరుడనబోకుమంటి । నీ - నామమే మదిలచూచుసుంటి ।
యేమందుభువిలోన । నీమహిమలుగన ।
సామాన్యులకునేల్ల । శక్యమవున సతల్లి ॥ త్రిపురా॥

౪. శరణని వేడితిసుమ్మీ । నీ - శరణజేసెదమదినమ్మీ ।
కరుణజూచిబ్రోవు । కాత్యాయనిగౌరి ।
హరురాణిశాద్వారి । శంకరిశ్రీబాలా ॥ త్రిపురా ॥

౫. ధరబోడాయపాలెమందు । శ్రీహరుచేంతగలవానివిందు ।
కరుణహృదయసక । లాప్తజనులనుబ్రోచె ।
వరచోడేశ్వరినాకు । వరమూలొసగవేతల్లి ॥ త్రిపురా ॥

౬. దోసిలొగ్గివేడినాను । నా - దోసములనుబాపుమికను ।
గాసిమాన్పవేగ । ఘనముగశేషకవి ।
నాసదీర్చవేవేగ । యఖిలలోకేశ్వరి ॥ త్రిపురా॥

రాగం - భైరవి - రూపకం.

కరుణించవె కామేశ్వరి । నెరనమ్మితినను బ్రోవవె ।
పరమశ్లేశ్వరు ప్రియసతి । వరమివ్వవె పరమేశ్వరి ॥ కరు॥

౧. ఓంకారి శ్రీప్రణవేశ్వరి । ఐంకారి శ్రీసరస్వతి ।
క్లీంకారి త్రిజగన్మోహిని । హ్రీంకారి శ్రీబగళేశ్వరి ॥ కరు॥

౨. మకరాలవతో సాకీధర । దీకరాల నీవెయని వేడితి ।
చికురాలను నెడబాపినీ । చేంతజేర్చు శరణంటిని ॥ కరు॥

౩. త్రిపురేశ్వరి జపతపములే । వుపమెరుగని యపరాధిని ।
నెపమెన్నక కృపజూడవె । యిపుడె నాయెదగొల్చెద ॥ కరు॥

౪. వరశ్రీశ్వేతపురపాలిని । ధరశేషయకవిపోషణి ।
అరమరయిక నేలనె బ్రోవ । హరిసోదరి అంబుజాక్షి ॥ కరు॥

రాగం - పంతువరాళి - అటతాళం.

త్రిపురాసుందరియిందురావె । తల్లి త్రిపురాసుందరియిందురావె ॥ త్రి॥

౧. త్రిపురాసుందరీనా నెపమూల నెంచక । కృపయుంచి బ్రోవవేగ రావె॥

౨. ఓంకారి।హ్రీంకారి క్లీంకారి।శ్రీశివ।శంకారినీవునిటు రావెయంబా॥

౩. మక్కువతోడనేనీ। చక్కనిపాదములె।దిక్కనినమ్మియుంటి రావె॥

౪. శంకరీనిత్యపస్పుకుంకుమాలంకారి। శంకుచక్రధరీరావె। జనని॥

౫. వరఅగస్త్యేశ్వరుని।సరసానునిలచిగొలచె।
శరచాపకరధారి రావె। యంబ॥ త్రిపురా॥

౬. వాసిగా శ్వేతపుర। వాసుఁడౌతంగిరాల।
శేషాయాఖ్యనుతేరావె। యంబ॥ త్రిపురా॥

రాగం - మధ్యమావతి - అటతాళం

రావేరావె। శ్రీరామసోదరి॥ రావేరావె॥

౧. రావెశివునికొమ్మ। రావెముద్దులగుమ్మ।
రావేమమ్మేలవె। రాజరాజేశ్వరి॥ రావె॥

౨. శరణనివేడితి। శ్రీహరుప్రియమనోహరి।
వరములునొసగవె। వరగౌరిమాతల్లి॥ రావె॥

౩. చిన్మయరూపిణి। చిదానందాత్మని।
చిత్కళజూపవె। స్థిరముగగొలచెద॥ రావె॥

౪. పలుమారునిన్నునె। ప్రస్తుతించుచునుంటి।
కలుషాములెడబాపు। ఘనత్రిపురసుందరి॥ రావె॥

౫. పల్లవపాణినీయుల్లమలరగబోడ్డు।
మల్లెమొల్లలపూజ। కొల్లాగజేసెద॥ రావె॥

౬. పంకజనేత్రిశ్రీ। శంఖుచక్రధర।
శంకరివేగనా। సంకటములబాపు॥ రావె॥

౭. కుంకుమలంకారి। కులమార్గపేతుణి।
పొంకముతోతనదు। పొడజూపవెజనని॥ రావె॥

౮. కోరినీకెశుక్రవారమందునపూజ।
కూరిమితోజేతు। కువలయానేత్రి॥ రావె॥

౯. గరళకంఠని చెంత । మురియుచు నిలచిన ।
పరదేవిని న్నెమది । భజయింపుచుంటిని ॥ రావె॥

౧౦. స్థిరము గ శ్రీ శ్వేత । పురమందు నెలకొన్న ।
వరఅగస్త్యేశ్వరుని । వల్లభ శ్రీలలితె ॥ రావె॥

౧౧. జాలమేలతంగి । రాల శేషయకవి ।
పాలన జేసెటి । ఫాలలోచను రాణి ॥ రావె॥

రాగం - శుద్ధవరాళి - ఆదితాళము.

అంబానీవు యిందు రావె జగ । దాంబానీవుయిందు రావె ॥
అంబా ఓ శ్రీకాళికాంబా నిన్ను నను మో । దంబుతో గాల చెదను రావే ॥
జగదాంబా నీవునిందు రావే ॥ అంబా॥

౧. శ్రాం శ్రీం శ్రూం శ్రైం శ్రౌం శ్రః। సర్వేశ్వరి శ్రీం శ్రీమహాలక్ష్మి రావె॥

౨. భ్రాం భ్రీం భ్రూం భ్రైం భ్రౌం భ్రః ।
బ్రాహ్మి భ్రీం డీం భద్రకాళి రావె ॥ జననీ ॥ అం॥

౩. హ్రాం హ్రీం హ్రూం ఫట్ । ఘోర బ్రాహ్మి శ్రీకూర ।
గ్రహముల చెండుచును రావె ॥ జననీ॥ అం॥

౪. ప్రేమతో నీవు నాదు । లేమిడి నెడబాపి ।
హేమవిద్యల నొసగ రావె ॥ జననీ॥ అం॥

౫. వాసిగ శ్వేతవు । రీశ శ్రితంగిరాల ।
శేషయ పాలిని రావె ॥ జననీ॥ అం॥

రాగం - సారంగ - అటతాళం.

మరువక వేడెదను । నామదిలోన। కరువెల్ల దీరగను। మరువాకా వేడెద।
మహాలక్ష్మి నిన్ను నే। అం హ్రీం క్రోం యనుచు నే। హరుప్రియరాణి నిక ॥మ॥

౧. శ్రీం - క్లీం - ఏం-ఏం- ఐం- ఐం- సర్వవశంకరి ।
అం - లం - వషట్। బాహ్మి । లంయుం। దాదిశబందు॥ మరు॥

౨. ఆం - హ్రీం - క్రోం- ఓం- జపుం గ్రహాజనకర్షిణీ ।
ఏహిమహేశ్వరిరం అగ్నిదిశబందు ॥ మరు॥

౩. మం - మం- దం- ఖెం- గ్రహా । సంహారకారిణి ।
హ్రీం- హింవారాహిశంయమదిశబందు ॥ మరు॥

౪. హ్స్రౌం-హ్స్రౌం- ఘుం- జం- థం- పరమంత్ర స్తంభిని ।
కురుకురుకౌమారి । షంనైరుతిదిశబందు ॥ మరు॥

౫. శ్రీం- శ్రీం- ఢం- తం వం- ఐశ్వర్యదాయిని ।
వాతవీంవైష్ణవి । వంవరుణదిశబందు ॥ మరు॥

౬. జం- ఘుం- లూం- యుం- ఊం - ఫట్ గుంబాగ్రహా శత్రులను ।
చం- చం- చాముండియం । వాయువ్యదిశబందు ॥ మరు॥

౭. థం- నం- క్లీం- హ్రీం- శ్రీం- శ్రీం । ధనధాన్యములనొసగు ।
ధం- ధం- ఇంద్రాణిసం । వుత్తరదిశబందు ॥ మరు॥

౮. ఓం- సాం- సీం- యనినా । సంశయములదీర్చు ।
సూంసారస్వతిహం । ఈశాన్యాదిశబందు ॥ మరు॥

౯. జం- శ్రీం- షం- వర్ణముల । పసిడితల్లివివేగ ।
శశిముఖిబ్రంహ్మణి। అంవూర్ధ్వదిశబందు ॥ మరు॥

౧౦. లం- లం- ఆంవర్ణముల । సర్వశత్రులదోలి ।
అధరామైనమః ఆంపాతాళదిశబందు ॥ మరు॥

౧౧. ఆం- హ్రీం- క్రోం- క్లీం వౌషట్। పరమంత్రభక్షిణి ।
ఓం- హ్రీం- క్ష్మ్య్రీం- హుం- ఫట్ మాం రక్షమాంరక్ష ॥ మరు॥

౧౨. మం- మం- రం- ఫట్ యను చులేముల నెడబాపి ।
హేమవిద్యలనొసగెలక్ష్మి కామేశ్వరిఁ॥ మరు॥

౧౩. ధాత్రుణిలో వెల్ల । టూరిసుబ్రహ్మణ్య ।
చేరివారింటిలో శేవగైకొను జననీ॥ మరు॥

౧౪. జాలవేంటితంగి । రాలశేషయనుడె ।
వా గా ప హ న క్త హా ) శ్రీ ) ) శ్రీ ) ౯ । మరు।

రాగం - ఆనందభైరవి - ఆదితాళం

తల్లీకామేశ్వరి బ్రోవవే । ఓతల్లికామేశ్వరి బ్రోవవే ।
మల్లెపువ్వులపూజ । కొల్లాగజేసెదను॥ తల్లి ॥

౧. తల్లికల్పకవల్లి । తనయాడనాపైనీదు ।
చల్లానికృపవేళ । జల్లివెముమగన్న ॥ తల్లీ॥

౨. తలితండ్రియుసతితో । తనయాలుసహోదరుల్ ।
యిల్లుబంధువులాపుల్ । కల్లానివేడుకొంటి ॥ తల్లీ॥

౩. మకూటవతోడనీవె । దికాటినినమ్మియుంటి ।
చకాటినిమాతల్లి । చికటిలావెడబాపి ॥ తల్లీ॥

౪. బాధలనెల్లనెడ్డ । బాపిబ్రోవవేవేగ ।
ఆధారశక్తిజ్ఞాన । బోధజేసియువేగ ॥ తల్లీ॥

౫. రిపుకూలనెల్లవేగ । కృపదప్పిధరాగూల్చి ।
విపరీతమగుశోక । వినోదమునుజూపి ॥ తల్లి॥

౬. శంకరిఐం- క్లీం- । శార్వరిహ్రీంశ్రీం ।
పంకజానేత్రిసౌః । పాపాసంహారిణి ॥ తల్లి॥

౭. పరమంత్రయంత్రతంత్ర । భక్షిణంశిక్షిణం ఆత్మమంత్రయంత్రతంత్ర ।
ఆదిసంరక్షిణీం । పరాశక్తిశ్రీశ్వేతపురపరిపాలినీం॥ తల్లి॥

౮. జాలామేలనేతంగిరాలశేషయకవి ।
పాలినిఆదిశక్తిఫాలినిలోచనురాణి॥ తల్లి॥

కామేశ్వరిమంగళహారతి.

రాగం - సురట - అటతాళం.

మంగళంమంగళం । మాహేశ్వరి మంగళంమంగళం ।
మంగళమనుచును । రంగుగనీకును పొంగుచుమనసుచె ।
లంగుచును బంగరుపళ్లెముల । శృంగారహారతులు ।
సంగతెమీకవొసంగెదయుంబా॥ మంగళం॥

౧. వాదములో జిక్కి మేదరిదో చక । నీదుచున్నమది ।
వేదనలామెకా మోదముతో నాదు । వేదన లెడబాపి ।
బోధ జేసియు వేగ ఆదరించవె తల్లి॥ మంగళం॥

౨. చపలచిత్తుడ నా । నెపముల నెంచక కపటముడిగి ।
నీకు కృపయుంచుజననీ । ఉపముగనీజప తపము లెరుంగని ।
అపరాధిననీత లపునుంచక బ్రోవు॥ మంగళం॥

౩. మాయానికపటాది । మాయవేషములని కాయముజూపిన ।
గనజాలనె మాయతో భంగము । జేయకె నీకునె ।
ప్రాయంపు సుతుడనే । తోయజగంధీ॥ మంగళం॥

౪. పల్లవపాణినా యుల్లమురంజిల్ల । సలలితముగనీ ।
చరణాబ్జములకు । మల్లెమొల్లలపూజ కొల్లగ జేసెద ।
చల్లనీమాతల్లి । కొల్లాపురీశ్వరీ॥ మంగళం॥

౫. ఫాలలోచనినీ లావణ్యరూపు । కోలాహలముగని ।
వేళజూపవె బాలుడనిన్నునె । చాలానమ్మియుంటి ।
లాలితంబుగ బ్రోవు । ఫాలలోచనురాణి॥ మంగళం॥

౬. బుద్ధిలేక నేను హద్దుపిడచిబహు । దిగ్దేశములనెల్ల ।
దిరుగుచునుంటి వార్ధికతో నీదు । ముద్దుపాదములాసగి ।
వద్దను జేర్చియు । ప్రొద్దుకామేశ్వరి॥ మంగళం॥

౭. కరుణతో శ్రీ స్వేత పురమున నెలకొన్న । వరఅగస్త్యేశ్వరునీ
వల్లదేలలితె । ధరణిలో శేషాకవిధన్యుని జేసిన ।
పరమదయానిధె । పావనచరితె॥ మంగళం॥

రాగం - జంఝూటి - ఆదితాళం.

హారతులివ్వరె । హరుప్రియురాణికి ।
నారిలలామలునయముతో కర్పూర॥ హారతు॥

౧. నృత్యము శేయుచు । భృత్యులై పాడుచు ।
సత్యముగనుమననిత్యకల్యాణికి॥ హారతు॥

౨. యమ్ల్లమురంజిల్లు । మల్లెలదండలు ।
చల్లనితల్లికి । కొల్లాగవేయుచు॥ హారతు॥

౩. అందముగనుమంచి । చందనమునుతెచ్చి ।
పొందుగ శ్రీత్రిపురసుందరిమెడబూసి॥ హారతు॥

౪. శ్వేతపురంబున । ఖ్యాతిగనెలకొన్న ।
దాతయాఅగస్త్యేశు । ధర్మసతికివేగ॥ హారతు॥

౫. వాసిగతంగిరాల । శేషయపోషణి ।
దాసులపాలిట । తల్లిపరదేవికి॥ హారతు॥

బగళాముఖి మంగళహారతి.

మంగళంశుభమంగళం । మంగళకరముకు । మహేశ్వరినీకు॥ మంగళం॥

౧. క్లింకారిశ్రీశివ । శంకరినీకును॥ మంగళం॥

౨. రాజరాజేశ్వరి । రాజీవలోచని॥ మంగళం॥

౩. అంగజవైరిశుభాంగి । శ్రీబగళాంబ॥ మంగళం॥

౪. కృపజూడవెజననీ । త్రిపురసుందరినీకు॥ మంగళం॥

౫. వరఅగస్త్యేశ్వరుని । వల్లభశ్రీలలితే॥ మంగళం॥

౬. శ్వేతపురవిహారీ । శేషకవిపాలినీ॥ మంగళం॥

త్రిపురసుందరి మంగళహారతి.

రాగం - బిలహారి - అటతాళం.

మంగళమిహశాంభవి । హేమాహిమాశృంగసంశ్రితసంభవీ ।
సంగతాయతజనతతిర్బహు । భంగదానవిభుగ్నచయా ।
సంగవైరమనోంగణనిల । యాంగనావినుతానుతాంచిత॥మం॥

౧. పంచభూతవిదారిణీ। విలసితముక్తసంచితమమకారిణీ।
పంచపంచయుతాక్షరీకృత। పంచకోశవిహారిణీ।
పంచదశహృత్ప్రపంచసముచిత। పంచశరహరసుందరీమణి॥మం॥

౨. శతకోటిస్థితభూషణీ। నిరుపమధీరా శతసంఖ్యాశ్రుతిభాషిణీ।
కృతకృత్రప్రతికృతవినోదిని। నతితయాంచితధృతినిధానని।
అతులితప్రతిమానసముచిత। నందసీనవత్రిపురసుందరి॥ మం॥

3. లలితపల్లవపాణిని। భూరిభారరోలంబనిభవేణిని।
జలజలోచనితలిమబోణిని। మలయజాప్తమయూవిలాసిని।
కలితతేజోల్లసితధామని। ఫలితమధుమృదుతులితచరణీ॥మంగ॥

౪. హాటకమణిభూషణీ। శ్వేతపురిమానేటిమందిరపోషణీ।
కోటికోటిసిరాటఘాటన। మేటిమతసంఘాటశోద్ధిత।
పాటలాధరితంగిరాలప్రతాపశేష। సమర్చితాంఘ్రిణీ॥ మంగ॥

అంబధ్యానకీర్తనలు - మంగళహారతులును.

సంపూర్ణం.





శ్రీ ర స్తు.

## పంచీకరణతత్త్వము.

రాగం - ముఖారి - అటతాళం.

వినవే ఓ మనసా విరివిగ మదిని । గనవే ఓ మనసా ।

వినయముతో దేశికవర్యుల పాదసేవ । ఘనముగా జేసి తె । కడతేరలేరు నే ।
తనను తాను నెరుగజాలక । మనసులో మర్మంబులుంచుక ।
ఘనుల మేమనుచు దిరిగెటి । జ్ఞానహీనుల తెరిచెదరు ॥ వినవే ॥

౧. మూలాధారమునా । నాలుగుదళములనొప్పుచున్నా ।
నాలుగక్షరములనపానవాయువు । నలభూమిముద్రయు ।
నారునూరులహంసల్ । సలలితంబుగ తుర్యాతీతయు ।
చెలగుచుండె నిచ్ఛాశక్తియు । మెలుగ గణపతి పసుపుఛాయలా
మెలగుచున్నా । మహిమగనవే ॥ వినవే ॥

౨. ఆరుదళములను అరసియున్నా । ఆరక్షరములా ।
మీరియున్నా పక్షిముద్ర జ్ఞానాశక్తి ।
ఆరువేలాహంసల్ నమరియుండెను । ఊరిమితో వ్యానావాయువు ।
స్థూలమగొని యా డీనతుర్యము । చేరి స్వాధిష్ఠానరక్త ।
వర్ణముంమన బ్రహ్మగనవే ॥ వినవే ॥

౩. దశదళములందు దశాక్షరముల్ । విశదముగానుండు ।
డాసీ ఆరువేలహంసలడీకొని । సుషుప్త్యావస్థాచిత్తము ప్రాజ్ఞుదభిమాని
భాసురముగ శివశక్తిటల్ । తొ ధాద్ని చేమణిపూరకంబున ।
వేసె పీఠముద్ర కృష్ణవర్ణమందున విష్ణుగనవే ॥ వినవే ॥

౪. తేరగు ద్వాదశ దళములయందు । ద్వాదశాక్షరముల్ ।
చేరి హృదయామందు । సీతాగ్ని హంకార ।
మీరి ప్రాణవాయువ । నారువేలంసలతో ।

పరాశక్తిననాహతంబులో । పలునులింగముద్రబూనుక ।
కోరినిలచెను శ్వేతకాంతితో । కొలువ్రదీర్చినశివునిగనుమిక॥ వినవే॥

౫. విశుద్ధమందెవిరివిగవెయ్యి । హంసలందుండె ।
ఆశమీఱినస్వప్నావస్థాభిమానితె ।
జన్సమానస్సుమహాశక్తిమత్స్యముద్ర ।
దేశికులు దెల్పినషోడశదళముల్ షోడశవర్ణములను ।
డాసిజ్యోతీవర్ణములో జీవుం । డాడుచున్న మార్గ మెరుగవె॥ వినవె॥

౬. పరమాత్మదైవము । బంగరుకాంతిచెప్రబచూచునుండూ ।
కోటిద్విదళములనుదూరి రెండక్షరముల్ ।
మీరివిశ్వుడుప్రకాశముద్ర కోపాగ్నిచే ।
సారెకునును దానవాయువు । జాగ్రదావస్థాభిమానినై ।
చేరిఆజ్ఞెయమందుహంసలు చెలగుచున్నవి వెయ్యిగనవె॥ వినవె॥

౭. మేటిసద్గురునిమాటయునమ్మి । బాటగనుగొనుమీ ।
పాటిల్లగనుగురుడాకాశముద్రయుభ్రాంతి ।
నూటిగవెయిహంసలతోటిసహస్రారమున ।
వాటమగుజ్ఞానాగ్నిచేబహు । తేటగానువాలలాడుచు ।
కోటిసూర్యప్రకాశమానుడైకొలువుదీర్చునాతడుగనవె॥ వినవె॥

౮. తనువులోస్థూలదేహాభిమాని । యైనజీవుండూ ।
ఘనమగువిశ్వుడనిపేరువహించుకొని । శతత్రితత్వములతో ।
జాగ్రదవస్థలందుననటించుచునుండునుసూమీ ।
తెలివిలోతెలివొందిసదా । మనసునాయోచించిఖేచరి ।
ముద్రబూనిమర్మ మెరుగవె॥ వినవె॥

౯. ఘనసూక్ష్మదేహాభి । మానియగుజీవుండుతాను ।
వినయముతో తైజను । డనుపేరువహించు ।
కొనిపదహేనుతత్వములనుస్వప్నావస్థలం।

దునవటించునుండునుమీఘనమగీమర్మంబు నెరిగిన ।
మనుజు లేనిధరను గొప్పమహా నీయుతైన దెరుగవే॥ వినవె॥

౧౦. పూనికారాణ దేహాభిమానెగు । జీవుదూ ప్రాజ్ఞా ।
డనిపేరువహించి త్రయోదశతత్వ్వను । లనుసుషుప్త్యావస్థాలం ।
దునవటించుచునుండు సూమీ । వినయముతో దేశకవర్యుల ।
వనజములమదిమరువకుండిన । మనుజు లేనీమర్మమెరుగుని ।
మాటనమ్మిబాటగనవె॥ వినవె॥

౧౧. ధరపూదుకంటికృష్ణవధూత । చరణాములందు ।
చేరితంగిరాల శేషయాఖ్యుడు సదస్థిగమతితో శేవ జేయుచుండగపంచి
కరణమందునమర్మమెల్లను । కరుణబూనియు దెల్పెదీని।
మరుగు దెలుసుకొన్నవారికి । పరమపదవీదొరుకున నెను॥ వినవె॥

పంచీకరణతత్వము.





శ్రీ ర స్తు.

# పెండ్లి పాటలు.

---

## గంధముబూసేపాట - రాగం - ఆదితాళం.

గంధముబుయ్యారారె । ఓసుందరాంగనలారా ।
పొందుగ శ్రీహరికి॥ గంధము॥

౧. యుత్తరి శ్రీహరి చిత్తమలరమంచి ।
అత్తరుఁగూర్చిన । నుత్తామైన శ్రీ॥ గంధము॥

౨. పువ్వుబోణులారా । పూర్ణేందుముఖునకు ।
రవ్వాశేయకనేమ్. । జవ్వాజిఁగూర్చిన॥ గంధము॥

౩. పన్నాగశయనుని । పైపాటలనుబాడి ।
పన్నీరుజల్లి వేగ । పరిమళమగు శ్రీ॥ గంధము॥

౪. సిందువేముకమీర । పుండరీకాక్షుని ।
అందను శెతికర్పూర । దండలు మెడ వేశి॥ గంధము॥

౫. కురులునున్నగదువ్వి । విరులదండలుఁజుట్టి ।
తీరైనకస్తూరి । తిలకమునొసటదిద్ది॥ గంధము॥

౬. చక్కనిదాజికాయ । జాపత్రిలవంగముల్ ।
వక్కలేలాకులతో । విడియాములందిచ్చి॥ గంధము॥

౭. వాసిగస్వేతపుర । వాసుడౌతంగిరాల ।
శేషయ్యకవిహృదయమేలునగును వేగ॥ గంధము॥

## నలుగుపాట.

### రాగం - హిందుస్తానికాఫి - ఆదితాళం.

నలుగుబెట్టెదరారా । నలినాయతాక్షా వేగా ।
పలుమారుబిలచినా । బలుకావదేలరా॥ నలుగు॥

౧. చెలులందరూనూగూడి । చెలగుచు పాడెదరూ ।
చలమేలరా రా శ్రీశా । పాలాపాపసంహారా॥ నలుగు॥

౨. అగడు శేయబోకురా । అనంతరూపాత్మకా ।
వగకాడరా తానిన్నే । వలచినదానరా॥ నలుగు॥

౩. అందమైనచందనమిం । పొందుగానునీమేనుకా ।
నందమూతో బూసినేడా । నందముందజేసెదాను॥ నలుగు॥

౪. పరిమెళమగునున్ని । పిండిలో పస్పుగల్పి ।
సరగూన నాలుగిడెదా । జారచోరసుకుమారా॥ నలుగు॥

౫. పల్లవధర నేడు । మల్లెపూలాదం[illegible]
కొల్లాగ నేనీమెడా । కోరి[illegible] స్వామీ॥ నలుగు॥

౬. తోషహారతంగిరాలా । [illegible]విను తావశ ।
వేషజాగు శేయబోకు[illegible] వేగరా గామనోహరా॥ నలుగు॥

## పూలబంతులపాటలు.

రాగం - హిం[illegible]కాఫీ - ఆదితాళము.

పూలబంతులాడగారా । [illegible] పూ॥
పాలితభక్తజనా । పాపాసంహార[illegible]జ॥ పూల॥

౧. పునుగుజవ్వాజిమీన । బూసెదరా రాఘునా ।
మనసూ సంది[illegible]మేలా । మగవాడగానరో[illegible]జి॥ పూల॥

౨. ముచ్చాటదీరగను । ముదమూతో కస్తూరి ।
హెచ్చైనతిలకమూ । మెచ్చిదిద్దెదవేగా॥ పూల॥

౩. చిత్తర్వుమేడాలోపా । లత్తారుపునుగాగరూ ।
ఓత్తూలసువ్వాసన । లెత్తగపారిజాతా॥ పూల॥

౪. పంతామేలరా స్వామి । చింతాలుదీర్చరా ।
పింతలింతగానుచా । మంతిపూలచండ్లతో॥ పూల॥

౫. చిన్నిశ్రీకృష్ణరారా । నిన్నేకోరినానురా ।
సన్నుతాంగనామదీ । చిన్నబుచ్చకాపానా॥ పూల॥

౭. చెలగూడుతంగిరాల । శేషయవరదూడా ।
నిలుపలేనురాదమీ । నీదానగానసామీ॥ పూల॥

రాగం - నాటకురంజి - చాపుతాళం.

బంతులాడరారా । పంతమేలసామి ।
వింతవింతగా । చామంతిపూలచండ్ల॥ బంతు॥

౧. వేడెదనురాతా । విడియమందుకోర ।
మోడిశేయకూర । నేసుజాజిపూల॥ బంతు॥

౨. వన్నెకాడవని । విన్నకోరినారా ।
నన్నుగూడివేగ । పొన్నపూలచండ్ల॥ బంతు॥

౩. భక్తిశోనునేనా । సక్తిగలిగియున్నా ।
యుక్తవయసునవా । సక్తిదీర్ప వేగ॥ బంతు॥

౪. సారసాక్షునన్ను । వేరుశేయకురా ।
కూరిమీతో వేగ । పారిజాతపూల॥ బంతు॥

౫. అందమైనయగరు । చందనాముగూర్చి ।
సుందరాంగమేను । కందమూగాబూయ॥ బంతు॥

౬. కల్లగాదురార । అల్లిబిల్లికిని ।
కొల్లగానుబోడ్డు । మల్లెపూలచండ్ల॥ బంతు॥

౭. పాటపాడెదనూ । కూటమికెనీవు ।
ధాటిగానుపూల । తోటలోకివేగ॥ బంతు॥

౮. వాసిగన్నేతావు । రీతుదైవచన్న ।
కేశవునిదలచు । శేషయకవినుత॥ బంతు॥

రాగం - జంఝూటి - ఆదితాళం.

బంతులాడరా తానాతో । పంతమేలాగో పాలా ।
దంతివరదవింతయాచా । మంతిపూలచండ్లతో॥ బంతు॥

౧. పరమపురుషా రార నేనీ । పాలబడినదానారా ।
అరమూరయిక నేలనీన్నే । నాశయించియుంటిరా॥ బంతు॥

౨. తప్పులేన్నబోకు మంచి । తరుణామిది మేరా సామి ।
తెప్పునసంపెంగపూలు । తెచ్చినే ల్లుగట్టితి॥ బంతు॥

౩. వగకాడా సీపైని నేను । వలపూ జేందినానురా ।
అగడు శేయబోకు వేగ । పోగడాపూల చెండ్లాతో॥ బంతు॥

౪. నన్ను తాంగానీదుసోగ । సేన్న నేవరితరమూరా ।
వన్నెకాడా నిన్నెగోరి । యున్నా నాతో ళుర్వ్వలా॥ బంతు॥

౫. వాసికెక్కు స్వేతపురినీ । వాసచెన్న కేశవా ।
భాసురముగ తంగిరాల । శేషకవి పాలకా॥ బంతు॥

## తలుపుదగ్గిర పాటలు.

రాగం - హిందుస్థాని భైరవి- అటతాళం.

౧. భామా ప్రేమలేదా । తామసమేల నే తలుపుతియ్యవె సత్య॥ భామా॥

౨. ఏరా మేరా యాటరా । పోరా పోరుగింద్లకు ప్రొద్దుపోవగ పాసి॥ యే॥

౩. వేమారు బిలచినబలుకవూ। నీ-వె మోమోచన జేసిగులుకూ।
కోమాలి వేగనాకోరి కావీర్చవె॥ భామా॥

౪. పలుమారు నను బిల్వనేలరా । నిట్లు- పరవనితాలగోరబోకురా ।
సలలితముగ నాతోసరసమాడుట మంచి॥ దేరా మేరా॥

౫. పరవనితాలా పొందుగోరనూ। ఇట్లు-పర్వ్వహీనపుమాటలాడను।
పరమాత్ముడను నాకు। పత్నివి నీవేగ॥ భామా॥

౬. పరమాత్ముండైతె నేమిరా। యింతో- పరువుగల్గినవాడైతె నేమిరా।
పరవనితాలగోర। పాపమనుచు నెరుగ॥ వేరా మేరా॥

౭. హరియనినను బిల్వనెరూగవె । నన్ను- హరితోషమగని గానేలవె।
సరగున నినుగూడు। సమయముగనివ స్త్రీ॥ భామా॥

౮. గూడవచ్చితినన నేలనూ। నీతో- గూడూటకుసు నేనెగా వెలనో।
వాడవనితలు నీకు। వదినామరద ళ్లేరి॥ ఏరా మేరా॥

౯. కోపమునాపైసింకేలనె। యితర- కోమలులకండ్లజూడనె।
యేపాపమెరుగని। గోపాలుడను నేను। భామా॥

౧౦. గోపాలుడావైతె వేగము। గాను-గోవ్రాలగాచుటేయుచితము।
వేపారమెరుగాని। వెర్రిగొల్లలకిది। వీరా మేరా॥

౧౧. అలిగినపని యెమో దెల్పవె। నీ-వనుమానములనన్నిమానవె।
యలశివచ్చితినింక। నాలశ్యమేలానే॥ భామా॥

౧౨. అలసివచ్చిననునాకేమిరా। వెం-యెలివేణులనుగూడితేమిరా।
అలుగూటకునునాకె। యంటూసోంటురనీవు॥ ఏరా॥

౧౩. కంటెకాసులపేరూదెచ్చితీ। నీ-కంఠమందుననుంచవచ్చితీ।
కంటకమికయేల। కాముకేళినిగరాడు॥ భామా॥

౧౪. కంఠెకాసులపేరుదీసుకా। మెచ్చే-కంటూలమెడలధరించుక।
తుంటవిల్తునివలన। తంటాలులేకుండ॥ పోరా మేరా॥

౧౫. నానుపట్టెడగుండ్లపేరును। ఓ- నలినాక్షినీకివ్వ తెస్తును।
కానుకగాగొని కౌగిలీయ్యవె సత్య॥ భామా॥

౧౬. నానుపట్టెడగుండ్లకోసము। యిపుడా। చానగాచుండేడిసమయము।
వానలుగురిసినా। వాతాలుమానునా॥ యేరా॥

౧౭. సూర్యచంద్రదహారమందుకు। నా-కార్యము నెరవేర్చవెందుకు।
భార్యవయినాతోటివాదములాడక॥ భామా॥

౧౮. హారాయలుబలుకుటనింకమానరా। దాని-ప్రియయముతో ప్రేమించినా ఫ
ప్రియతియతిభార్యయని పెద్దలుజెప్పవిన॥ వేరా మేరా॥ (ర।

౧౯. వారిజాక్షిరోవినుమిప్పుడు। మేము-వారాలసొమ్మునిస్తును।
కోరికదీరగకొమ్మగుబ్బలనడుమ॥ భామా॥

౨౦. అభరణమూలనునంటకు। నీకు-వైభోగములుసక్పెటందకు।
అంభోధిశయనవా। రాంగననుగాను॥ తేరా మేరా॥

౨౧. కొమ్మారొనినుకోరివచ్చితి। మదను-డమ్ములువేయగమదివొచ్చితి।
కంమ్మానిమోవీరస। మిమ్ముసమ్మోతితోడ॥ భామా॥

౨౨. మారుడునీసుకుమారుడె। గాద-మీరి సాయకమేయక్రూరుడే।
ధీరుడవీకో కొఱ్ఱ-దీర్చమనుటాతగదు॥ లేరామేరా॥

౨౩. వాసిగ శ్వేతాపురమందునా। నన్ను-కేశవుడనియెరిగియుంటినా।
పేశలాంగినన్ను। ప్రేమించకుందువె॥ భామా॥

౨౪. వాసిగా శ్వేతపురంబునా। నన్ను-కేశవుడని గొప్ప జెందినా।
భాసురాంగులయిండ్ల పాదచారినైదిరుగు॥ ఓరామేరా॥

౨౫. తంగిరాలకులాబ్ధిచంద్రుడో। మా-త్సంగతినెరిగిన భక్తుడవు।
పొంగుచు శేషయబరాజించగనుకోతె॥ భామా॥

౨౬. శేషయవరదూడవైతేనూ। సం-తోషమువర్ధిల్లుటింకను।
శేషశయనాతల్పు। శీఘ్రమెఱరచితి॥ రారామనోహరా॥

రాగం - కరహరప్రియ- అటతాళం.

౧. తలుపుదియ్యవె సత్యభామ। తామసంబిక నేలనే।
పలుమరుబిలచినగాని। బలుకకున్నవదేలనే॥ తలుపు॥

౨. తలుపుదియ్యను పోరనీదు। టక్కు-మాటలేలరా।
పలుమరూనను బిలువబోకుర। పాతకాసంహారకా॥ తలుపుదియ్యను॥

౩. కోపమేల నాతో జెప్పవె। కోమలీ నీవిప్పుడు।
రాపుజేసి నిరాకరించుట। రమణి నీకదితగునటె॥ తలుపుదియ్యవె॥

౪. సలలితంబుగ అర్థరాత్రి। సమయమందునవచ్చియు।
తలుపుదియ్యమనుట నీకిది। తగదు తగదిక పోపోరా॥ తలుపుదియ్యను॥

౫. కలికి కావాటాముదియ్యని। కారణాము జెప్పవే।
అలసివచ్చియు వాకిటానె। నిలచియుంచుట న్యాయమా॥ తలుపుది॥

౬. అలుకదీర్చే దానగాను। పిలచి నా ఫలమేమిరా।
నిలచేయున్నవు నీదుపేరు। నిజము నాతో జెప్పరా॥ తలుపుదియ్యను॥

౭. పేరుజెప్పెద తలుపుదియ్యవె। ప్రేమమరచినావటె।
వేరెయోచనలేటికనే। వేణుగోపాలుడనే॥ తలుపుదియ్యవె॥

౮. వేణుగోపాలుడవైతే। వేగముగయాగొల్లనీల।
వేణులిండ్లకిపోరనాతో। వేడబములాడాకుగా॥ తలుపుదియ్యను॥

౯. కల్లగాదునమాటవినవె। చల్లపాలంమ్మెటివెర్రి।
గొల్లభామాలపొందునాకు। తెల్లునకొటికోమలీ ॥ తలుపుదియ్యవె॥

౧౦. కల్లలాడినఫలముయేమిరా। గొల్లగృహములెల్లదిరుగు।
చల్లపాలనుగ్రోలిభామలజక్కపెట్టుకవస్తివా॥తలుపుదియ్యను॥

౧౧. పెక్కులీలాపరావనితల।చక్కబెట్టెటివాడగాను।
మక్కువతోనినెగోరివచ్చితి।మానినీమణివినగదె ॥ తలుపుదియ్యవె॥

౧౨. పంతమేలాచెల్వరాపర। కాంతలిండ్లకుబోకకుండిన।
యింతరాత్రివేళవచ్చుట।యంతోవింతగనున్నదీ ॥ తలుపుదియ్యను॥

౧౩. మురయుచును మేల్। గిరులవెంబడిదిరిగిగోవులవెంటనైకొని ।
పరుగుపరుగునవచ్చినాగాని।ప్రొద్దుపోయెనెభామినీ॥ తలుపు॥

౧౪. శ్రీశ్రీమత్స్వేతపురనివాసుడౌధరతంగిరాల ।
శేషయాఖ్యుడుసీవిచిత్రము।తెలుగుచునునాతోజెప్పరా॥తలుపు॥

౧౫. తలుపుదీసెదనురకృష్ణ। తప్పులెన్నబోకురా ।
కులుకుచునుపూలపాన్పుపై వేగ।గూడికొగాలించరా॥తలుదీసెదను॥

## బువ్వము బంతిపాట,

### రాగం - కమాచి - అటతాళం.

రారెచెలులారగసీతా। రామచంద్రులబువ్వమునా ।
నేరెయోచనలేటికేబహు। వేగవపోయిబూతము॥ రారె॥

౧. వేదువారమలొస్వమ్ములన్ని।సేమమనముధరించుకుందము ।
మోడిశేయకరాములసా।మూహముగనుగొందము॥రా॥

౨. పట్టుచీరెలుగట్టిమనము। చెట్టబట్టలుబట్టుకొనిఘన ।
పట్టభద్రునినెదుటనిలచిపాటలన్నిబాడుదాము॥ రా॥

౩. శృంగారామైనట్టిముగ్గులు। అంగనాలుకళిరి।
బంగరుఅరిటాకువేశి। బంతులెన్నోదీర్చిరీ॥ రారె॥

౪. వున్నతంబుగనన్నివిధముల। వూరగాయలుబంతులంబడి ।
సన్నుతాంగులుదిరుగుచునుబహు। జకటగావడ్డింతురూ॥ రా రే॥

౫. డినుసుదినుసుకూరగాయలు। దివ్యముగపక్వంబుజేసి ।
మనసుతృప్తిదీరగనుము। మ్యాటికీవడ్డింతురూ॥ రా రే॥

౬. అందమైనాకందిపప్పు। ఆజ్యమునువులుసూనుచాగు ।
సుందరాంగనలెల్లబల్యా। నందముతొవడ్డింతురూ॥ రా రే॥

౭. చెప్పతరముగాసిగొప్ప। అప్పడంబులువడియములనూ।
వొప్పగాదినువారికెల్ల । వనరుగావడ్డింతురూ॥ రా రే॥

౮. మేలుసబ్బూబియ్యమావు। పాలుచక్కెరతోడనుబహు ।
మేలుగావండినపర। మాన్నమువడ్డింతురూ॥ రా రే॥

౯. దూమఫేడబర్ఫీ వలల్వా। దివ్యమైహాబూందిలడ్డు ।
మోదముతోజీలేబిఫేణి। మాఖ్యముగవడ్డింతురూ॥ రా రే॥

౧౦. గారెలుఅరిశేలుపూర్ణం। బూరెలుబహుగొప్పనూనుగు।
బూరెలువడ్డించినేడూ। బువ్వమూసాగింతురూ॥ రా రే॥

౧౧. అందమగుపందిటిలోదాస। బృందమధ్యమునందునున్నశ్రీ ।
మందగమనునిమోముజూడయా। నందముందుదున్నదీ॥ రా రే॥

౧౨. శ్రీశశ్రీమత్స్వేతపురని। వాసుడౌధరతంగిరాల।
శేషయాఖ్యుడుచేరిగొలచె।శీతరామూలానందమూ॥ రా రే॥

## కొట్నాల పాట.

౧. భామలారరారేసీత। రామచంద్రులకైదుట ।
ప్రేమమీరకొట్నాలపాటబాడరే॥ సువ్వి-సువ్వాలవే॥

౨. ఘనులుసురమునులుపుర। జనులెల్లఘనమైన ।
దినుసుదినుసువడ్లునేడు। దెచ్చిపంచిరీ॥ సువ్వి-సువ్వాలవే॥

3. వినయామూతోదినుసువారి । పడ్లగంపలానుచే।
కొనిరామునెదుటనేము। కొట్నాలుదంపవే।సువ్వి-సువ్వాలవే॥

౪. అత్తగద్దవాడ్లుపా। లాత్తగద్దపివాడ్లు ।
వాత్తగద్దవాడ్లు నేడు। ప్రేమతోడనూ॥ సువ్వి॥

౫. వెలవడమువడ్లు మేల్। మొలకోలుకెలావడ్లు।
చెలగుచును నేమలివడ్లు । జిలమువడ్లును॥ సువ్వి॥

౬. వడ్లుకుసుమవడ్లుసాంభవ। వడ్లమేల్చిన్నసాంభవ ।
వడ్లుపిన్నకుసుమలాను। వర్ణింపుచూ॥ సువ్వి॥

౭. ధాటిగానుఅకుల్లు। మేటిచన్నంగివడ్లు ।
చీటేము త్యాలవడ్లు। సొంపుమీరగ॥ సువ్వి॥

౮. రామసాగరాలవడ్లు। రమ్యమైనబుడమవడ్లు ।
శేమరును కేసరివడ్లు। విషముకోరలు॥ సువ్వి॥

౯. పొట్టినల్లవరివడ్లు। పొంకముతొసన్నవడ్లు ।
పొట్టికేసర్లవడ్లీ। పుడమియందున॥ సువ్వి॥

౧౦. వడ్లురాజభోగాలు। వడ్లుండిల్లిభోగాలు।
వడ్లుంబంగరుతీగె। లొడ్లుసుఖవాసులూ॥ సువ్వి॥

౧౧. సారెకునుగుత్తికుసుమల్। సొగసైనకాకిరెకల్ ।
కోరికొనమాణిలు। గడ్డవడ్లనూ॥ సువ్వి॥

౧౨. ధరనుపండుచున్నవడ్ల। ధాన్యమూలనామములను।
వరసగానుపాడరమ్మా। వనితాలందరూ॥ సువ్వి॥

౧౩. వాసికెక్కెన్వేతపురసీ। వాసుదేవతంగిరాల।
శేషకవివరదునెదుట । చేరిపాడరే॥ సువ్వి॥

ఒప్పగింతలపాట.

జానకనిశ్రీరామచంద్రునకునిచ్చి ।
జనకమహారాజు జేసె తాపెండ్లి॥ గౌరికళ్యాణ॥

౧. ఘనులుసోమాదిత్యులును।సురలుగూడి। సనకాదిమునులెల్ల।
సన్నుతింపగను। కనకపూపుష్పములవానగురియగను।
దేవదుందుభులెల్ల। దివిమ్రోయగను। గౌరి।

౨. వినయముతోపురజనులువినుతిసేయగను ।
ఘనరామచంద్రునకదలెనావేళ। జానకినిప్పెనముజేయమనుచూను।
జనకునకుకభురూను। జేసెదశరధుడు॥ గౌరి॥

౩. దశరధునిపలుకులను జనకునీసతి । విశదముగవినితమా।
వదినెతోబలికె। పసిబాలముద్దులాపణతిసీతమ్మా।
కసరకనుగైకొని । కరుణించరమ్మా॥ గౌరి॥

౪. మేచేటినోములు। మెన్నోన్నోమేము।
మాటిమాటికినోయూ। మాయింటవెలసె।
ఆటపాటలతోడఅంబరంబుగను।పాటిల్లగాపెరిగె।బాలసుకుమారీ॥

౫. కన్నులాపండుగనుగనిపెంచినాము। వన్నెమీరినపసిడి।
వుయ్యాలలోను। చన్నుమీరగపూలపాన్పుపైవేసి।
వున్నతంబుగనుంచి। వూచుచుంటిమీ॥ గౌరి॥

౬. ముసిముసినగుమోముముద్దులాసీత। పసితనముచేఆట ।
పాటలాడినా। కసరించికోపించకనుబెంచిమేమీ।
వశముజేసితిమమ్మా । వనజాక్షినిదిగో॥ గౌరి॥

౭. మాముద్దులాపట్టిముగన్నతల్లీ। మావనోహరియూది ।
మాచేతిచిలుకా। మామనసురంజిల్లు ।
మాణిక్యమీది । మామగువసుందరనిమన్నించరమ్మా॥గౌరి॥

౮. నాసుతూరాలనీనమ్మబోకమ్మా। నీసుతురాలనినె వరుంచవమ్మా।
ఆశతోబెంచిమీకొప్పగించితిమి। ఆసక్తితోమీరూ। ఆదారించండి॥

౯. మాపణతిగాదంటి। మీపణతియంటి । యీపణతినీమిముల।
మేలుకొమ్మంటి। కోపమూమదిబూనికొట్టిట్టకనూ ।
కాపాడరమ్మినుగో। కనకంపుబొమ్మా॥ గౌరి॥

౧౦. తానుకోరినచిచీరెవికలనునిచ్చి। మనసురంజిల్లాగా ।
భరణామూలానిచ్చి। ఘనముగాబెంచితిమిజానకినిమేము।
కనులారజూచితె। కలికివిగులాంమూ। గౌరి॥

౧౧. ముప్పూటఅన్నము ముదముతో బెట్టి। గొప్పగా బెంచితిమీ।
కొప్పగించితిమి। పనిపాటలను యేమిపణతి యెరుగాదు ।
పనిపాటలను నేర్చి। పాలించుకొండీ॥ గౌరి॥

౧౨. జనకునీసతియపుడు। జానకినిబిలచి। ఘనమగూ నీతూలు ।
కరుణాతో జెప్పే। మనసుదిగులొందకూమా తల్లినీవు।
మనయింటిలోకన్నా। మర్యాదానొందూ॥ గౌరి॥

౧౩. పతిఆజ్ఞలోబడీయుండుమా తల్లి। పతిమాటకెదురాడ।
బలుకాబోకమ్మా। అత్తమామలఆడబిడ్డమాటలకూ।
అడుగుదాటకనీవు। అణిగుండవమ్మా॥ గౌరి॥

౧౪. మరిదిలక్ష్మణుడెంతో। మహాబుద్ధిశాలీ। మరియాదగానీవు।
మాట్లాడుచుండూ। భరతశత్రుఘ్నులుబహు మంచివారు ।
పరువుగానీవుండూ। బంగారుబొమ్మ॥ గౌరి॥

౧౫. ప్రీతితో జనకునిసతిజానకీకి। హితవాక్యమూలానీ ।
రీతిబోధించే। పనిడిపళ్ళెరమందు పాలుంచుకొనీ।
పసిబాలకరమూను। పాలానుముంచే॥ గౌరి॥

౧౬. మురయుచును జానకీకరముబట్టుకొనీ ।
శ్రీరాముచేతులో చెయ్యొప్పాగించె। హంసవలెనడచేటిఆజానకినీ।
కౌసల్యచేతూలో చెయ్యొప్పాగించె॥ గౌరి॥

౧౭. పసిడివన్నెగలా పణతిజానకినీ। దశరధుని చేతూలో చెయ్యొప్పాగించే
సుకుమారి గా బెరుగుచున్న జానకిని।
కైకమ్మచేతూలో చెయ్యొప్పాగించే॥ గౌరి॥

౧౮. తమలపాకూవంటితరుణిజానకిని । సూమిత్రచేతూలో చెయ్యొప్పా
గించె। శతపత్రసౌకర్యజానకినపుడు । శాంతమ్మచేతూలో చెయ్యొ
ప్పాగించె॥ గౌరి॥

౧౯. తామరాపువ్వువంటిభామజానకినీ। సవుమిత్రిచేతూలో చెయ్యొప్పాగిం
చె। మరకతము కాంతిగలమగువజానకినీ। భరతూనిచేతూలో చెయ్యొ
ప్పాగించే॥

౧౦. ప్రీతితో బెంచినవాతిజానకిని। శేషయ్యను చేతూలో చెయ్యొప్పగించె।
పేరుపేరున పెళ్లి పెద్దలనుబిలచి।వారలందరికినివప్పగించెనూ॥ గౌ॥

౧౧. కుచలునున్నగదువ్వివిరులనూముడచి। అరుదుగాన త్రింటి।
కంపాబూనిరి । వెలలేనిచీరె రెవికలనుదెచ్చిరి।
కలికిజానకికీని కట్టబెట్టిరి॥ గౌరి॥

౧౨. కోరిచాసోమ్ములనకోదువలేకాను। కూరిమితోయిచ్చిరి ।
కానుకాగాను। ముసిముసినగు మోముముద్దుజానకికీ ।
పసుపుకుంకుమసకలా। పలమూలనిచ్చే॥ గౌరి॥

౧౩. ఆభరణములుదెచ్చిరిఅంగనాలపుడు। శుభగాత్రిజానాకి।
ధరియించేనపుడూ। చెన్నొందుచున్నట్టిజానకికినపుడు ।
అన్నికానకలిచ్చిరంపిరావేళ॥ గౌరి॥

౧౪. చకచానిజానకిని చంక నెత్తుకుని। మకుటావతో సెకిలి।
ముద్దాడూకొనిరి। జానకిని పైనము జేసి రావేళ।
జనకునిసతిమాది । దిగులొందాగానూ॥ గౌరి॥

౧౫. జానకినిచేబట్టిజయరామునురాత్రి। వినయముతో।
నయోధ్యానేగాశెనూ। పట్టణంబునుశీతాపతికిగట్టిరి ।
పట్టాభిషేకూలై । పట్నామేలిరి॥ గౌరి॥

౧౬. స్థిరముగను శ్రీశ్వేతపురమునందూనా । వరచెన్నకేశవవ।
తారునెదుటను। చేరితంగిరాల శేషయ్యాఖ్యాదు।
కూరిమితోనిపాటకోరిజేసెనూ॥ గౌరి॥

పెండ్లిపాటలు.

సంపూర్ణము





శ్రీ ర స్తు.

# కామేశ్వరికోలనుపాటలు.

---

గౌరీశివశంకరుడూ। ఘననందినెక్కి। కరుణాతోకైలాసా।
గిరులాకునేగ। వరనజూడుకోలనుకర్త। వనజాక్షితాను।
పరికించియేడుగురు। ఆడంగబూచి। హరనివ్వగంటీవా।
ఆనందకోలను। కరుణాతోదేవతుల। కనులారగంటి ।
పరదేవిపరంజ్యోతి। పోతన్నగంగ। పరికించిప్రళయకాల।
వీరాభద్రుండు। పరివారదేవాతుల్ ।బాగుమీరగను।
సరగూనగర్భమునజన్మించవలెను ॥ మన॥

పల్లవి.

౧. మనమంతపాడంగమనకామువెలసె। మనమూనవేడంగమనయింట
వెలశె।అనుదినమునువేడఅక్కల్లువెలశె।ఘనలక్ష్మికామేశ్వరీకోలనా
డరంభమీ॥ మన॥

౨. తోడానెదేవికిదాహామాయేను। ఘుడియాలోశూలముచేకోలమ్రత
న్వించే। వేడుకతోశూలామువెంటనేవుదకం ।
వచ్చియాకొల్లనెల్లవేగనీండేను।మూడుదోశల్యానుమొందారగించె।
యేడుమహానుగూడి। యేకామైగలశె ।
ఆవేళాదేవికియేనాగర్భంబు।నాడెఘుడియలమీదనతిధారామాయే।
తోడానెతొమ్మిదిఘడియలకుతూలె। వేడూకతోడానువేగాదేవతులు
చూడాసొంపుగబుట్టె। చోద్యాముగాను॥

౩. అరికాళ్ళబుట్టిందిఅతివావిసుకంమ।అతివావిసుకంమ్మగట్టెఅందామా
పట్టు । మడమల్లాబుట్టిందిమహాలక్ష్మితాను। మహాలక్ష్మితాగట్టెమం
చిదోకపటు॥ మన॥

పడమల్లాబుట్టిందిమహాలక్ష్మితాను। మహాలక్ష్మితాగట్టెమంచిదాక పట్టు ॥ మన॥

౪. కెందీతోడలనుబుట్టెకీరవేణమ్మా। కీరవేణితాగట్టె కలంకారీపట్టు। పైతోడలాబుట్టిందిసేరావేణమ్మా। పేరవేణితాగట్టె। పచ్చానీపట్టు॥ మనమాసుపాలకొలను॥

౫. బొడ్డగావాన బుట్టెను పోతన్న తాను। పోతన్న తాగట్టె పీతాంబరమ్మా। వీపూరా బుట్టెను పిగంన్నా తాను। పిన్నన్న తాగట్టె వెలలేనిపట్టు॥మ॥

౬. చంకల్లాపుట్టింది జక్కులమ్మ తాను। జక్కులమ్మ తాగట్టె చక్కానిప ట్టు। కరమూలపుట్టింది కూనలమ్మ తాను। కూనలమ్మ తాగట్టె కోరిన పట్టు॥ మన॥

౭. కన్నులాబుట్టింది కలికి కామమ్మ। కామమ్మ తాగట్టె కనకంపుపట్టు। మే మగురికకలను। భయముహరించె పట్టె। శ్రీదేవమ్మ తాగట్టె తెల్లనిపట్టు॥

౮. పీకల్లబుట్టింది అంకమ్మ తాను। అంకమ్మ తాగట్టె అనుదయినపట్టు। మోకాళ్ళబుట్టిందిమరెమ్మ తాను। మారెమ్మ తాగట్టె ముఖమల్ల పట్టు॥ మన॥

౯. పక్కల్లాబుట్టిందిపంతిపోలేరు। పోలేరు తాగట్టె ప్రియమైనాపట్టు। గోమ్ములాబుట్టింది రమణిసొప్పలాకె। రమణిసొప్పటకెగట్టె రంజిల్లెపట్టు॥ మనమాడూము పాల॥

౧౦. గోళ్ళనుబుట్టింది గోగులమ్మ తాను। గోగులమ్మ తాగట్టె గోరంచుపట్టు పిరుదల్లాబుట్టిందిపోచమ్మ తాను। పోచమ్మ తాగట్టె పోకంపుపట్టు॥ మ॥

౧౧. నడుమల్లాబుట్టిందినతిపశీతల। నతివాశీతలగట్టెనల్లానీపట్టు। వేలను బుట్టింది వారాహి తాను। వారాహి తాగట్టె యెర్రనిపట్టు॥ మ॥

౧౨. బాహువులాబుట్టింది బాలాంబ తాను। బాలాంబ తాగట్టె బంగారు పట్టు। గూళ్ళల్లో బుట్టిందిగురవమ్మ తాను। గురవమ్మా తాగట్టెకుదు రైనపట్టు॥ మన॥

౧౩. కంఠమునాబుట్టిందిగ్రామేశ్వరీని। గ్రామేశ్వరితాగట్టైకోరినాపట్టు చవులల్లోబుట్టిందిచంచమ్మతాను। చంచమ్మతాగట్టై। చంగల్వాపట్టు॥ మన॥

౧౪. ముఖమునాబుట్టింది మోహనాంగితాను। మోహనాంగి తాగట్టై మోహనపుపట్టు। ముక్కునబుట్టిందిముత్యాలమ్మతాను। ముత్యాలమ్మతాగట్టైముద్దులపట్టు॥ మన॥

౧౫. మెడలానుబుట్టింది మద్దెలమ్మతాను। మద్దెలమ్మతాగట్టై మక్కువగుపట్టు। సిరసూనాబుట్టింది చిత్స్వరూపితాను। చిత్స్వరూపితాగట్టైస్థిరమైనాపట్టు॥ మన॥

౧౬. దీటూగానూటొక్క దేవాతులపుడు। బాటీదినమునబుట్టె। నాట్యమాడుచునూ। కోటీరిపులనయినాగెలిచెటివారు। బాటిల్లుచుండిరి। బాల్యప్రాయమున॥ మన॥

౧౭. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుతగిలమడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్ల జలకామడిగేరు॥

౧౮. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుపస్పుఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరుపుట్టుచుఅక్కల్లుకుంకుమడిగేను॥ మన॥

౧౯. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లు గంధమడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లు పూలుఅడిగేరు॥

౨౦. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుపూజలడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుధూపమడిగేరు॥మ॥

౨౧. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లు దీపమడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లు సూపాజ్యాన్నమడిగేరు॥ మన॥

౨౨. పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లుచీరెలడిగేరు। పుట్టుచుఅక్కల్లుయేమిఅడిగేరు। పుట్టుచుఅక్కల్లురవికలడిగేరు॥మన॥

౨౩. పుట్టించుఅక్కల్లాంయేమిఅడిగేరు । పుట్టించుఅక్కల్లావిడియములడిగేరు। పుట్టించుఅక్కల్లాంయేమిఅడిగేరు। పుట్టించుఅక్కల్లాంప్రయ్యాల్లడిగేరు॥ మనమ్మాడుపాలకోలను॥

౨౪. పేరింటిఅక్కల్లాంయేమియిచ్చేరు।పేరింటిఅక్కల్లాంవరముతిచ్చేరు।యేటేటఅక్కల్లాంయేమియిచ్చేరు।యేటేటఅక్కల్లాంశుభమూలిచ్చేరు॥

౨౫. గోరిగొలచినఅక్కల్ యేమియిచ్చేరు । కోరినకోరికల్ కొనసాగించేరు। నిరతముఅక్కలను నెరనమ్మియుంటె। కరుణించుశ్రీఆదికామేశ్వరంమ్మా ॥ మన॥

౨౬. వకరుఅంటెటితగిలంవకరుఅంటూరు । వీర్నిభరించుచమనవశముగాదెననూ। వకరుఆడేటిజలకంవకరుఆడరు । వీర్నిభరించుచమనవశముగాదెననూ॥ మన॥

౨౭. వకరుపూశేటిపస్పవకరుబుయ్యారు। వీర్నిభరియించ మనవశముగాదెననూ। వకరుబెట్టేటిబొట్టు వకరుబెట్టారు । వీర్నిభరియించమనవశముగాదెననూ ॥ మన॥

౨౮. వకరుపూశేటిగంధంవకరుబుయ్యారు। వీర్నిభరించుచమనవశముగాదెననూ । వకరుముడిచేటిపూలు వకరుముడవరూ । వీర్నిభరియించమనవశముగాదెననూ॥ మన॥

౨౯. వకరుఅందెటిపూజావకరుఅందరూ । వీర్నిభరియించమనవశముగాదెననూ। వకరుగైకొనుధూపంవకరుగైకొనరు। వీర్నిభరియించమనవశముగాదెననూ। మన॥

౩౦. వకరుజెందినదీపంవకరూజెందరూ।వీర్నిభరియించమనవశముగాదెననూ। వకరుతినెడిసూపాజ్యాన్నంవకరుతినారు। వీర్నిభరియించమనవశముగాదనెనూ॥ మన॥

౩౧. వకరుగట్టినచీరెవకరుగట్టారు । వీర్నిభరియించ మనవశముగాదెనెనూ। వకరుతొడిగినరెవికెవకరుతొడగరూ। వీర్నిభరియించమనవశముగాదనెనూ॥ మన॥

౩౨. వకరు వేసెటివిడియంవకరు వెయ్యారు। వీర్ని భరియించ మనవశముగా దనేను। వకరువూగటివుయ్యాలవకరువూగారు। వీర్ని భరియించ మనవశముగాదనేను॥ మన॥

౩౩. చ్చాకాలి తెచ్చినాచలవపడతలనా। తాకావద్దని తీసి దాచీవుంచిరీ। ఆకులకట్టానుచే తాబట్టుకుని। అతికోపావేశమునా అగ్నికురుపించ కాకకన్నులతో టికసరించేసరికి। యీకట్లన్నిను మనకు యికతరము కాదూ। సుదతీసూభద్రాను బిలువారె వేగా। సరగునశపియించిచనుదెంచిపోను॥ మన॥

౩౪. పార్వతీశ్వరులుపూబలికినమాటల్। బాలూలువిని వేగ బలికె వారీతో। శరణుజేశెదాము సూభద్రమామ। శపియించకను చేసికరుణెంచమనిరీ॥ మన॥

౩౫. అంతటహరునకుఅతిప్రేమగలిగి। సంతోషమునతనసతితోడబలికె షంతముతోడసూభద్రకుకభుడు। పంపవద్దని వేగబలికె తానపుడు॥

౩౬. శివునివాక్యములానూచిత్తమందుంచి। శివశక్తిసంతోషచిత్తురాలయెనూ। మనసురంజిల్లేటి మాతపితృలకు। వినయము జేసెరీ వేగ బాలూలు॥ మన॥

౩౭. మంములందరీనిరంమ్మనిపలికె। మందహాసము నందుముదమ్మూతోను। చి। సరగూనగైకొనిచనుదెంచిమీరు పాకేటినదిమీద బెట్టిరమ్మనిరీ॥ మ॥

౩౮. బాలూలుబలికినపలుకూలువీని। పాలలోచనూడుబలికెగౌరితో। మేలుమందహాసమూను గైకొని। వాలాయముగనదిలో వదిలిరమ్మనెనూ॥

౩౯. వెంటనెహరువాక్యంవినిమందహాసం। వేగమెనదిమీదవిడచె తాగౌరి। అంతటబాలులు అడలగజూచి। అందరిని యేకాతీ ఆదరించేనూ॥ మ॥

౪౦. కంటకమునుబూనికామింమ్మతాను। వెంటనెపొన్నల్లుదాటివచ్చెమూ। వున్నతంబుగవింమ పొగడల్లుదాటి। తిన్నగతనతండ్రి తొడలపైనిలచె॥ మన॥

౪౧. వన్నెవన్నెపూలుకన్నూలజల్లి। చన్నుమీరగశివునికన్నూలుమూసె॥ కన్నూలుగనుపించకనుశివుమనిద్ర। అన్నపానాదులుఅన్ని తావిడచె।

౪౨. తోడనే హారుడూతనతోయజాక్షితో । మోడి శేయక శశవదన మాకిగిరమ్మనెను । బంగారు చాటలో పమిడిముత్యాలు । బోసుక శ్రీగౌరిబయలుదేరెను॥ మన॥

౪౩. చేరి శ్రీవేల్పులాసానినీజూచి । సరగూన శశుసాము జెప్పమని అడిగె । చలగూచు వేల్పులసానీగారికి । సలలీతముగ జెప్పె శశునమావేళ॥ మన॥

౪౪. వచ్చిరీవీరూలువాలలాడుచును । సంచితములుతమకు సంభవించినవీ । వరుసగ జెప్పెదవినవమ్మతల్లి । హారునకుకంన్నూలు అగుపాడవంమ ॥ మన॥

౪౫. సఖియాలుమీనగరాన వెల శెమన్నారు । చలిమీది పానకం అడుగుతున్నారు । చెలియాలుమీనగరాన వెల శెమన్నారు । పూలుకుంకుమపసుపు అడుగుతున్నారు॥ మన॥

౪౬. పణతులుమీనగరాన వెల శెమన్నారు । పట్టుచీరెలు రెవిక లడుగుతున్నారు । కాంతాలుమీనగరాన వెల శెమన్నారు । ఘనసూపాజ్యాన్నం అడుగుతున్నారు॥ మన॥

౪౭. యింతకుమించినచింతలు లేవు । యింతితమనగరికీ యికె వెళ్ళమనెను । శివశెక్తి వశ్చైనూ శీఘ్రముగాను । శివునితో తా మనవి శేయసాగెనూ॥

౪౮. సంచితములుమనకూ । సంభవించినవీ । వచ్చిరీవీరులువాలలాడుచును । హారునకుకన్నూలు అగుపడవాని । వరుసగ జెప్పెను వేల్పాలసాని ॥ మన॥

౪౯. సఖియాలుమీనగరాన వెల శెమన్నారు । చలిమీది పానకం అడుగుతున్నారు । చెలియాలుమీనగరాన వెల శెమన్నారు । పూలుకుంకుమపస్పు అడుగుతున్నారు॥ మన॥

౫౦. పణతులుమననగరాన వెల శెమన్నారు । పట్టుచీరెలు రెవికెలడుగుతున్నారు । కాంతాలుమననగరాన వెల శెమన్నారు । ఘనసూపాజ్యాన్నము అడుగుతున్నారు॥ మన॥

౫౧. మస్తైళ్లు తాళాలు పెంచి మేళములు। వాద్దిక కోపీలపించి వాయించమని రీ। వనములలోకో వెలలు ఘనముగా గూడి। వినయముతో అక్క ల్లు వచ్చి రా పురికి ॥ మన॥

౫౨. శ్రీలక్ష్మి అక్కల్లు శృంగార చెలులూ। మేలయిన యానజుడు కోలను తా గొలచె। ముత్యములారీతెయా మెద్దుల కోలను। చందనముయా కోల ముచల్లా ఘూలి॥ మన ॥

౫౩. వజ్రములవంటి వట్టివి కోలనూ। వనరాగుమాణిక్యం వంటి యా కో లనూ। గంగపొంగేటి కోలను। కదలేటేవుదకం। రంగాగు యా కోల నుమంగళ కరము॥ మన॥

౫౪. పచ్చి పస్పు ముద్ద చేతబట్టుకుని। సఖియాలు కోలనాడపయి నామైనా రు। తెల్లయా పస్పు ముద్ద చేతబట్టుకుని। చెలియాలు కోలనాడపయి నామైనారు॥ మన॥

౫౫. అణుకు పస్పు ముద్ద చేతబట్టుకుని। పణతులు కోలనాడ పైనమైనారు। కస్తూరి పస్పునూ కరమూన బట్టి। కాంతాలు కోలనాడ పయినమై నారు॥ మన॥

౫౬. అరికాళ్ళ బుట్టింది అతివెవిసుకమ్మా। అతివెవిసుకమ్మ గోరె। అందమ వు కోలను। మడమల్లోబుట్టింది మహాలక్ష్మి తాను। మహాలక్ష్మి తా గోరె ముత్యాల కోలను॥ మన।

౫౭. కెందొడలా బుట్టిన కీర వేణమ్మా। కీర వేణి తా గోరె కమలాల కోలను। పైతొడలా బుట్టిన పేర వేణమ్మా। పేర వేణి తా గోరె ప్రియమైన కోల నూ॥ మన॥

౫౮. బొడ్డునబుట్టిన పోతన్న తాను। పోతన్న తా గోరు పద్మాల కోలనూ। వీ పూనబుట్టిన వీరన్న తాను। వీరన్న తా గోరె విచిత్రంపు కోలనూ॥ మ॥

౫౯. చంకల్లా బుట్టిన జక్కులమ్మా తానూ। జక్కులమ్మా తా గోరె చల్లాని కోలను। కరమూలబుట్టిన కూనలమ్మ తాను। కూనలమ్మ తా గోరె చందనపు కోలనూ॥ మన॥

౭౦. కన్నులారాబుట్టినకామంమతాను। కామంమతాగోరి కనకంపుకొలనా। నాటాకర దేవతులు నాట్యమాడగనూ। బోటులందరుకొలనుపాటపాడేరు॥ మన॥

౭౧. చలగూచుముత్యాలకుంచచేబట్టి। శ్రీలక్ష్మికామేశ్వరీ కొలనాడవచ్చే। ప్రియమైనకెంపులకుంచచేబట్టి। పేర్వాణికొలనాడప్పైనామైవచ్చే॥ మన॥

౭౨. గుంద్రనీలరవ్వలాకుంచచేబట్టి। కూనలమ్మకొలనాడప్పైనామయివచ్చే। వట్రువపచ్చలకుంచచేబట్టి। విసుకమ్మకొలనాడప్పైనామయివచ్చే॥ మన॥

౭౩. కోటివైడూర్యములాకుంచచేబట్టి। కీర్వాణికొలనాడప్పైనామైవచ్చే। ఘనగోమేధికములాకుంచచేబట్టి। ఘనయోగమహాలక్ష్మికొలనాడవచ్చే॥ మన॥

౭౪. చకారనిపుష్యరాగములకుంచచేబట్టి। జక్కులమ్మకొలనాడప్పైనామైవచ్చే। పాలపొగడములాలకుంచచేబట్టి। పోతన్నకొలనాడప్పైనామైవచ్చే॥ మన॥

౭౫. కూరిమిపోసిలములాకుంచచేబట్టి। పిన్నకొలనాడ వెడలీతావచ్చె। చలగూచుఅక్కల్లువన్నెమీరగను। కొలనాడిరావేళకోలాహలముగనూ॥ మన॥

౭౬. కొలనాడివచ్చేటి అక్కలనుజూ॥ పోతన్నవిరర్న పరులీడివచ్చి। పురమునజొచ్చిరిపోతన్ననాల్గు। ఉరవాజలనమూరి తాళములువేసె॥ మన॥

౭౭. తూర్పువాకిటానునీలచినకల్లు। తుమ్మిపూలుమేముతెచ్చితిమనరీ। తుమ్మిపూలునుమీరుగొల్తురైనాను। తియ్యాకోతలుపూలా తాళాములాను॥ మన॥

౭౮. దక్షిణావువాకిటనిలచినకల్లు। తామరపూలూమేముతెచ్చితిమనిరీ। తామరపూవ్వులుమీరుగొల్తురైనాను। తియ్యాకోతలుపూలతాళాములాను॥ మన॥

౧౯. పడమరవాకిటనిలచినక్కల్లు। పసుపుబంతు మేము దెచ్చితిమనిరీ। పసుపుబంతులుమీరుగోల్తురైనాను। తియ్యారోతలుపూలాతాళాములాను॥ మన॥

౨౦. ఉత్తరపువాకిటనిలచెనక్కల్లు। పత్తివత్తులపట్టిదెచ్చితిమనిరీ। పత్తివత్తులుమీరుగోల్తురైనాను। తియ్యారోతలుపూలతాళాములాను॥

౨౧. అక్కల్లు నిలచినపలుకూలవినీ। గ్రక్కూననవీరన్నకదలీవచ్చెనూ। తాళమేళములనూ తాదీసుకోని। తాళాములనుదీసితలుపూల దెరచె॥ మ॥

౨౨. కొలనాడినా పుదకంపసిడిపళ్లేములో। గైకోనియేడుగురు అక్కాలొచ్చిరి। కొలనాడినక్కల్లు యానగ్రవోన। కుదురుగాగూర్చుండికోరసాగిరి॥ మన॥

౨౩. కొలనాడి అక్కల్లు మేమిగోరిరి। పసుపుకుంకుమపరిమెళ గంధము గోరిరి। కొలనాడిఅక్కల్లు మేమిగోరిరి। జాజిసంపెంగామల్లెపూలుగోరిరి॥ మన॥

౨౪. కొలనాడి అక్కల్లుమేమిగోరిరి। కొల్లాగపూజాలు జేయాగోరిరి। కొలనాడి అక్కల్లుమేమిగోరిరి। కొల్లాగధూపదీపములూ గోరిరి॥ మన॥

౨౫. కొలనాడి అక్కల్లు మేమిగోరిరి। చలిమిడిపానకము వడాపప్పు గోరిరి। కొలనాడి అక్కల్లుమేమిగోరిరి। పాలుచక్కెరమామిడిపళ్ళూ గోరిరి॥ మన॥

౨౬. కొలనాడిఅక్కలు మేమిగోరిరి। అంటినారింజజామపళ్ళు గోరిరి। కొలనాడిఅక్కల్లు మేమిగోరిరి। ఫలఖర్జూరాదానిమ్మపళ్ళు గోరిరి॥ మన॥

౨౭. కొలనాడి అక్కల్లు మేమిగోరిరి। పనసజంబూద్రాక్షపళ్ళు గోరిరి। కొలనాడిఅక్కలుమేమిగోరిరి। కమలాల్బత్తా నారింజపళ్ళు గోరిరి॥ మన॥

౭౮. కొలనాడిఅక్కల్లు యేమిగోరిరి। పంపరమనసలవార్పాపల్యాగోరిరి। కొలనాడిఅక్కల్లుయేమిగోరిరి। జీడిబాదముసారపప్పులుగోరిరి॥ మన॥

౭౯. కొలనాడిఅక్కల్లు యేమిగోరిరి। తేనెనారికేళఫలములుగోరిరి।కొలనాడి అక్కల్లు యేమిగోరిరి। కూరాటిపప్పు పచ్చళ్ళుగోరిరి॥ మన॥

౮౦. కొలనాడి అక్కల్లుయేమిగారీరి। పరమాన్నమావునెయ్యిఅన్నముగారీరి। కొలనాడి అక్కల్లుయేమిగారీరి। మేలయినపిండివంటలనుగారీరి॥ మన॥

౮౧. కొలనాడి అక్కల్లుయేమిగారీరి । పులుసుబానును తియ్యాపేరుగుకోరిరి। కొలనాడిఅక్కల్లుయేమిగారీరి । వెలలేని చీరెరెవికలను గారీరి॥ మన॥

౮౨. కొలనాడిఅక్కల్లుయేమిగారీరి । పరిమళముగువక్క పొడిగోరిరి। కొలనాడిఅక్కల్లు యేమిగారీరి। తెల్లనీతమలపాకులను గారీరి॥ మన॥

౮౩. కొలనాడిఅక్కల్లుయేమిగారీరి । అష్టభోగమ్ములు అమరగారీరి। కొలనాడిఅక్కల్లుయేమిగారీరి। శుభమగు పెళ్లిళ్లుసేయగారీరి॥ మన॥

౮౪. యీకొలనుగొలచినాకావుపేరేమి। కావుశ్రీమామయ్య కల్పవృక్షమ్ము। యీకొలనుగొలచినాఅతినాపేరేమి। అతివెసమిఅత్తయ్య అరటివృక్షమ్ము॥ మన॥

౮౫. అయోధ్యస్థానకానవెలకొనుచుండి। అయోధ్యరాములసన్నిధాన వెలశినకామేశ్వరి కొలనాడరమ్మి । ప్రయాగస్థాన కానవెలకొనుచుండి । శ్రీమాధవస్వామిసన్నిధాన వెలశిన కామేశ్వరికొలనాడరమ్మి॥ మన॥

౮౬. వారణాసిస్థానకానవెలకొనుచుండి । విశ్వేశ్వరస్వామిసన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడరమ్మి। ద్వారకాపురిస్థానకానవెలకొను

చుండి । ద్వారకేశ్వరస్వామిసన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడ
రమ్మి॥ మన॥

౮౭. జగన్నాథంస్థానకానసెలకొనుచుండి। జగన్నాథస్వామి సన్నిధా
న వెలశినకామేశ్వరి కొలనాడరమ్మి। అలసవల్లిస్థానకానసెలకొను
చుండి । శ్రీసూర్యనారాయణస్వామి సన్నిధానవెలశినకామేశ్వరి
కొలనాడరమ్మి॥ మన॥

౮౮. శ్రీకాళహస్తింస్థానకానసెలకొనుచుండి । శ్రీకాళహస్తీశ్వర స్వామిసన్ని
ధానవెలశినకామేశ్వరి కొలనాడరమ్మి। సింహాచలంస్థానకానసెల
కొనుచుండి। సింహాద్రి అప్పన్నసన్నిధాన వెలశినకామేశ్వరి కొల
నాడరమ్మి॥ మన॥

౮౯. పిఠాపురంస్థానకానసెలకొనుచుండి। కుక్కుటేశ్వరస్వామిసన్నిధా
న వెలశిన కామేశ్వరికొలనాడరమ్మి। చాల్లంగిస్థానకాన సెలకొను
చుండి। చాల్లంగేశ్వరస్వామి సన్నిధానవెలశినకామేశ్వరి కొలనా
డరమ్మి॥ మన॥

౯౦. రాజమహేంద్రవరంస్థానకాన సెలకొనుచుండి । రాజగోపాల
స్వామిసన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడరమ్మి। శ్రీదాక్షారం
స్థానకానసెలకొనుచుండి। శ్రీభీమేశ్వరస్వామి సన్నిధానవెలశినకా
మేశ్వరి కొలనాడరమ్మి॥ మన॥

౯౧. కోటిపల్లిస్థానకానసెలకొనుచుండి। సోమేశ్వరస్వామి సన్నిధాన
వెలశినకామేశ్వరికొలనాడరమ్మి। ముక్తేశ్వరంస్థానకాన సెలకొను
చుండి । ముక్తేశ్వరస్వామి సన్నిధాన వెలశిన కామేశ్వరికొలనాడ
రమ్మి॥ మన॥

౯౨. శ్రీభద్రాద్రిస్థానకాన సెలకొనుచుండి। శ్రీసీతారాముల సన్నిధా
న వెలశినకామేశ్వరి కొలనాడరమ్మి। బెజవాడకృష్ణా స్థానకానసెల
కొనుచుండి। మల్లికార్జునస్వామి సన్నిధానవెలశిన కామేశ్వరికొ

౹౩. శివగంగ స్థానకాన నెలకొనుచుండి । గోపాలస్వామి సన్నిధాన వెలశినకామేశ్వరి కొలనాడరమ్మీ । శ్రీమోపిదేవిస్థానకాన నెలకొనుచుండి। సుబ్రహ్మణ్యేశ్వర స్వామిసన్నిధాన వెలశిన కామేశ్వరికొలనాడరమ్మీ। మన॥

౹౪. పెదకళ్ళేపల్లిస్థానకాన నెలకొనుచుండి । శ్రీనాగేశ్వర సన్నిధాన వెలశినకామేశ్వరి కొలనాడరమ్మీ । విశ్వనాథపల్లి స్థానకాన నెలకొనుచుండి । విశ్వేశ్వరస్వామి సన్నిధాన వెలసిన కామేశ్వరి కొలనాడరమ్మీ॥ మన॥

౹౫. శ్రీహంసలదీవిస్థానకాన నెలకొనుచుండి। శ్రీవేణుగోపాల స్వామి సన్నిధాన వెలశిన కామేశ్వరి కొలనాడరమ్మీ। మూలతోటస్థానకాన నెలకొనుచుండి । ముక్తీశ్వర స్వామిసన్నిధాన వెలశిన కామేశ్వరి కొలనాడరమ్మీ॥ మన॥

౹౬. శ్రీభట్టిప్రోలుస్థానకాన నెలకొనుచుండి। శ్రీపిఠలేశ్వర స్వామిసన్నిధాన వెలశిన కామేశ్వరి కొలనాడరమ్మీ। తెనాలిస్థానకాన నెలకొనుచుండి। శ్రీరామలింగస్వామి సన్నిధాన వెలసినకామేశ్వరి కొలనాడరమ్మీ॥ మన॥

౹౭. పొన్నూరుస్థాన కానసెలకొనుచుండి । భావనారాయణ స్వామిసన్నిధాన వెలశిన కామేశ్వరికొలనాడరమ్మీ । నెల్లూరుస్థానకాననెలకొనుచుండి । మూలస్థానేశ్వరస్వామి సన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడరమ్మీ। మన॥

౹౮. కాళహస్త్రిస్థానకాన నెలకొనుచుండి । కాళహస్త్రీశ్వర స్వామి సన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడరమ్మీ। చన్నపట్నంస్థానకాన నెలకొనుచుండి । కందస్వామి సన్నిధాన వెలశినకామేశ్వరి కొలనాడరమ్మీ॥ మన॥

౹౯. వుడిపిస్థానకాన నెలకొనుచుండి। వుమామహేశ్వరస్వామిసన్నిధాన వెలశినకామేశ్వరికొలనాడరమ్మీ । సుబ్రహ్మణ్యంస్థానకాన నెల

కొనుచుండి। సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి॥ మన॥

౧౦౦. చోళపురిస్థానకాన నెలకొనుచుండి । జగదీశ్వరస్వామిసన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి । వళయూళంస్థానకాన నెలకొనుచుండి । మహాశక్తీశ్వరస్వామి సన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి॥ మన॥

౧౦౧. అనంతశయనం స్థానకాన నెలకొనుచుండి । అనంతపద్మనాభస్వామిసన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి । తిరుచినాపల్లిస్థానకాననెలకొనుచుండి । తిరుచునాపల్లేశ్వరస్వామి సన్నిధానవెలసినకామేశ్వరి కొలనాడరమ్మి॥ మన॥

౧౦౨. శృంగగిరిస్థానకాననెలకొనుచుండి। చంద్రమౌళీశ్వరస్వామిసన్నిధానవెలసిన కామేశ్వరికొలనాడరమ్మి । శృంగేరిస్థానకాన నెలకొనుచుండి। అటవీకేశ్వరస్వామిసన్నిధానవెలసిన కామేశ్వరికొలనాడరమ్మి॥ మన॥

౧౦౩. కొల్లాపురిస్థానకాన నెలకొనుచుండి । కొల్లాపురేశ్వరస్వామి సన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి । విరూపాక్షం స్థానకాన నెలకొనుచుండి । విరూపాక్షేశ్వరస్వామిసన్నిధానవెలసిన కామేశ్వరికొలనాడరమ్మి। మన॥

౧౦౪. తాడిపత్రిస్థానకాననెలకొనుచుండి । తాపసాధీశ్వర స్వామిసన్నిధాన వెలసినకామేశ్వరి కొలనాడరమ్మి। గుత్తిస్థానకాన నెలకొనుచుండి। గోపాలస్వామి సన్నిధానవెలసిన కామేశ్వరికొలనాడరమ్మి। మన॥

౧౦౫. శ్రీశయిలంస్థానకాననెలకొనుచుండి। శ్రీమల్లికార్జునస్వామిసన్నిధానవెలసినకామేశ్వరికొలనాడరమ్మి। కోటప్పగిరిస్థానకాన నెలకొనుచుండి । కోటేశ్వర స్వామిసన్నిధాన వెలసిన కామేశ్వరి కొలనాడరమ్మి। మన।

౧౦౬. మంగళగిరిస్థానకాన నెలకొనుచుండి । మంగళాద్రి నృసింహస్వా
మిసన్నిధాన వెలసినకామేశ్వరి కొలనాడరమ్మి । అమరావతిస్థాన
కాననెలకొనుచుండి । అమరేశ్వరస్వామి సన్నిధానవెలసినకామే
శ్వరికొలనాడరమ్మి॥ మన॥

౧౦౭. కొల్లిపరస్థానకాననెలకొనుచుండి । ఆకుతోటలో వెలసిన కామే
శ్వరీ కొలనాడరంమీ । కొల్లూరుస్థానకాన నెలకొనుచుండి। భో
గేశ్వరస్వామి సన్నిధానవెలసిన కామేశ్వరి కొలనాడరంమీ॥మన॥

౧౦౮. కోటిపల్లిస్థానకాన నెలకొనుచుండి । సోమేశ్వరస్వామిసన్నిధాన
వెలసినకామేశ్వరికొలనాడరమ్మి । పెల్లటూరుస్థానకాన నెలకొను
చుండి । అగస్త్యేశ్వరస్వామి సన్నిధాన వెలసిన కామేశ్వరి కొల
నాడరమ్మి॥ మన॥

౧౦౯. కొలనూజలకమాడికొలారెత్తిరి । కొలనూజలక మాడికొలలుడించి
రీ । కొలనుజలకామాడి కోటిపాపములు । పెటాగల్పుకపుణ్య
బాటగనుగొనిరీ॥ మన॥

౧౧౦. యేపొటా యీకొలను యెవరూగొలచినా । పాటిల్లగను అష్ట
భాగ్యముల్ గలుగూ । యింటింటయీకొలను యెవరూ గొలచిన।
వెంటనేశుభములు తాయివేలుగలుగు॥ మనమాడిపాలకొలను॥

౧౧౧. ఘనశ్రీఆదిలక్ష్మి కామేశ్వరమ్మ । పాదసేవకుడగుచూ పాటిల్లుచు
న్న । తెలగుడుతంగిరాల శేషయాఖ్యుడు । జేసెనికొలనుపాటచె
న్నమీరగను॥ మనమాడిపాలకొలను॥

కా మే శ్వ రి కొ ల ను పా ట.

స ం పూ ర్ణ ము.





శ్రీరస్తు.

---

# లాలిపాట.

లాలిశ్రీగోపాల । లాలిభూపాలా । లాలిభక్తనుకూల।
లాలిశ్రీలోలా ॥ లాలి॥

౧. కదలకను దేవకి యుదరములో నెట్లు । వాదిగుండి వెలసితివా । వా యగ్యారిబాలా । మోదముతో యశోద ముద్దుకుమారా । మోదమె కుడకాళింగమర్దనాశూర॥ లాలి॥

౨. సన్నతాంగులచీరెలన్ని చేకొని । పొన్నమానెక్కికూర్చున్న సుకుమార । చిన్నారిగోపికలుమన్నించకనుచు। నన్నివిధముల వేడ।నవ్వుచుంటివ॥ లాలి॥

౩. యుల్లమలరగపశిడి । బిల్లముకోరు । కొల్లగావుదేటి, గోకులోద్భవా । గొల్లగృహములలోకి మెల్లగాబోయి । చల్లపాలునుత్రాగ । జననమైనావా ॥ లాలి॥

౪. భామలకొంగులను । బట్టిలాగగను । తామసంబుతో వారు । తగవులను శేయు । యేమియెరుగనని । యశోదతోడ । వేమారుబలికితివ। వేణుగోపాలా॥ లాలి॥

౫. పనిలేకపలుగాకి । పనులకునుబోయి । దినదినముయాగీలుదెచ్చుచుంటివా । వనితలందరుతలలు। వంచుకునితాగ । వెనుకనుంచిరాళ్ళు । వేసివచ్చితివా॥ లాలి॥

౬. గొల్లభామలురేపల్లెవాడలో । కొల్లగానుస్నీళ్ల । కడవలనుతేగ।గిల్లుచేకడవలను । చిల్లులుగజేసి। నల్లనయ్యావేగ యిల్లుచొచ్చితివా

౭. కుదురగుగోపికల । గుబ్బలనుపట్టి । పదములర మోహినీ। మునిపంటనొక్కి। గదసిఅధరముగ్రోలి । ఘనరతులదేలి। మదలకనువచ్చితివ । మాచిన్నికృష్ణా॥ లాలి॥

౮. వాసిగా శ్వేతపుర । వాసవరదన్న । కేశవవతారమును । కరుణించుచున్న। శ్రీశతంగిరాలశేషకవిసన్న । పశితివృయ్యాలలో। బవళించుమన్న॥ లాలి॥

జో ల పా ట.

జోజో జోజో శ్రీరామచంద్రజోజో । జోజోరఘుకుల । సోమసీతేశ ॥ జోజో॥

౧. అంగనాలెల్ల శ్రీరంగరంగనుచు । శృంగారమగుపాటల్‌సొగసుగాబాడ । రంగమందిరమూన నుప్పొంగుచుసనీవు । బంగారుతొట్లలో। బవళించియుండు ॥ జోజో॥

౨. సచ్చిదానందనీసరిదైవమేది । కుత్సితుండగు సోమకునిగూల్చితివి। హెచ్చైనవేదముల్‌ । తెచ్చిఘజునకును। మెచ్చియిచ్చినధీర । మచ్చావతార॥ జోజో॥

౩. శరణుశరణనినన్నే । చేరిగొలచూచు। సురలందరునుగూడి । మొరలీడగాను । మొరవినిమందర । గిరిమోచివేశీ । కరుణించినట్టిశ్రీ క్రూర్మావతార ॥ జో జో॥

౪. అవమరయేలరా । శ్రితజనపాల । పరమభక్తనుకూల । పాపసంహార । హిరణ్యాక్షునిబట్టి । యింపుతోజంపి । ధరగూలవేసిన। వరహావతార॥ జోజో॥

౫. రొదజేశివేడప్ర । హ్లాదునిబ్రోవ । వుదయించితివినీవు। వుక్కుస్తంభమున । కదలకను । హిరణ్యాకశిపునిబట్టి । వధియించినట్టిశ్రీ। వుగ్రనరశింహ్వా॥ జోజో॥

౬. బలిచక్రవర్తిచే । భూదానమండి। యిలస్వర్గములు నిండియుంటివాకేళ్ల । అలనాగలోకము । అధిపతిగజేసి । విలసిల్లుచుండేటి వామనావతార । జోజో॥

౭. గర్జించికార్తవీర్యార్జునునినీవు । కతములుఖండించిగర్వమణచితివి । వర్జించి దీనులను వర్ధిల్లజేసే । దుర్జనసంహార వౌరపరశురామా॥ జోజో॥

౮. ఘనమగుశివునిల్లు । గర్వమునబట్టి । చను జెంచి రావణుని । సంహా రించితివి । వనచరులు గొనియాడ । వేగనయోధ్య । జానకితో జేరిన జయరామచంద్ర ॥ జోజో ॥

౯. వలగుదునుయాదవ । కులమందునీవు । చెలశభక్తుల నెల్ల । వేగబ్రోచితివి । అలసురులనుబట్టి । నణచితివిధువిని । బలరాముడనిజనులు బిలువసాగిరి ॥ జోజో ॥

౧౦. ముర్తయొచునుసురమునులు । ముదముతో వేడ । కరుణించి మ్లేచ్ఛాదిక పటులనుద్వంచ । వరభక్తులకుదివ్యవరములొసగంగ । విరివిగా బుద్ధావ । తారమెత్తితివి ॥ జోజో ॥

౧౧. సలలితంబుగనీవు । సద్గుణంబులను । యిలభక్తులెల్ల । కొనియాడు చుండగను । నీలవర్ణశరీరావు । నెలమితోబ్రోవు । కలుషముల నెడబాపు । కలికావతార ॥ జోజో ॥

౧౨. ఘనులు సోమాదిత్యు । లునుపురాజనులు । సనకాదిమునులెల్ల । సన్నుతింపగనూ । జానకినిచేబట్టి । జయభేరివేసి । మనసురంజిల్లేటి మారామమూర్తి ॥ జోజో ॥

౧౩. వాసిగా శ్వేతపుర । వాసవరదన్న । కేశవవతారనినే । కొనియాడుచున్న । శ్రీశతంగిరాల । శేషకవినన్న । వేసరినిపుయ్యాల । లూచుచునేనున్న ॥ జోజో ॥

మేలుకొలుపు - రాగం . భూపాళం.

తెల్లవారివచ్చె । తెల్లగదరసామి । యిల్లెల్లబయలాయె లేరా । పల్లవధరనాదు । యుల్లమురంజిల్ల । కొల్లగగూడితివి లేరా ॥ తెల్ల ॥

౧. కానుల పేరునీ । కేశపాశమునదగిలె । దీసుకొందుమ గాని లేరా । వేసారకనుకోడి । గూసేటినల్లాము । దాసామనోల్లాసలేరా ॥ తెల్ల ॥

౨. ఊరిజనులుందా । జారులవెంటను । జేరితరుగసాగెలేరా । ఆవడ శేషుడు । దూరముమాయిల్లు । జేరవలెనుకృష్ణాలేరా ॥ తెల్ల ॥

౩. పచ్చలజతనీ । పచ్చడముక్రింద । బోచ్చెవెతుకగవలెలేరా । యిచ్చతోనీవునా । ముచ్చటదీర్చేటి । అచ్యుతశ్రీకృష్ణలేరా ॥ తెల్ల ॥

౪. బన్నసరమునీ । వెన్నక్రిందనుజిక్కి । యున్నదిగో పాలలేరా। స
న్నుతాంగులుజూడ। చిన్నతనమువును । మన్నించివేగమెలేరా॥ తె॥

౫. ముక్కుపుడకనీ । పక్కక్రిందనుబడి। జక్కకున్నదివేగలేరా। నిక్క
మునామగడు । పెక్కుమాటాలాడు। మ్రొక్కెదశ్రీకృష్ణాలేరా॥

౬. నవ్వులాటలవేళ చెవ్వగవ్వలదుద్దు । యెవ్వైవున్నో బడెలేరా। పు
వ్వుబోణులుజూచి । నవ్వరెకోపైతె । మువ్వంపునాసామిలేరా॥ తె॥

౭. బంగారుమెడగూళ్లు । రంగాగుసిపోవతె । కెంగుకిందబడెలేరా।
అంగనామణులాకీ । సంగతిదెలసిన । భంగమొచ్చును గాసిలేరా॥

౮. పచ్చలపతకము । ఎచ్చటబడినాదో । హెచ్చుగనే జూచులేరా।
చెచ్చరముగచెల్లె। లొచ్చునేముగాని । సచ్చిదానందుమలేరా॥ తె॥

౯. కుడిచైపంగరమునీ । మెడక్రిందికెనిజారి । బడిపోయుకడున్నాదిలేరా
ఘడియప్రొద్దుకన్న । కాలములేదుపా। లక్కడలికటానవయికలేరా॥

౧౦. చక్కనివానల్లచుక్కలచీరెనీ । పక్కకిందనుబడెలేరా ।
మక్కువతోనన్ను పెక్కురతులగూడి। సొక్కియున్నావికలేరా॥

౧౧. గొబ్బునవాగబ్బిగుబ్బలుకరముల । కబ్బబట్టెటిసామిలేరా।
నిబ్బరమామదితబ్బిబ్బుశేస్తివి । అబ్బరంపుసామిలేరా॥ తెల్ల॥

౧౨. మక్కువచెక్కిలి । నొక్కినవొక్కలు । జక్కజేసుకొందులేరా।
రక్కసియగుయత్త । చిక్కులబెట్టును । గ్రక్కుననాసామిలేరా॥

౧౩. కమ్మనిమధురాము । గుమ్ముగుమ్మనిగ్రోలే । విమ్మనియడిగేవులేరా
కమ్మనిమోహినీ । కెమ్మనుచునోసట । బ్రహ్మాగ్రాంతున్నాడు లేరా॥

౧౪. మదముతోనామోవి । గదియపంటనునొక్కి । సదయుడ నీవిక
లేరా । మృదువగునీమాట । కెదురాడజాలక । బెదిరి యున్నాని
క లేరా॥ తె॥

౧౫. ముచ్చటగమేన । బూసినఅత్తరు । హెచ్చువాసన బాడమెలేరా।
వెచ్చనిజలకము । దెచ్చివసరెంచుక । జెచ్చెరబోవలెలేరా॥ తె॥

౧౫. సూటిగఆబ్రహ్మ । దీటుగమనలను । కూటమిగువి గూర్చెలేరా। కోటిమన్మథరూప । హాటకాంబరధర । సాటివారలుమెచ్చలేరా॥

౧౬. వాసిగశ్వేతపు । రీశవరశ్రీచన్న । కేశవనికవేగలేరా । శ్రీశతంగిరాల। శేషయకవినేలు । దాసదోసవినాశలేరా॥ తె॥

పెండ్లి పాటలు.

సంపూర్ణము.





శ్రీరస్తు.

# శ్వేతపురిజావళీలు.

రాగం - కాంబోది - ఆదితాళం.

బాలనిన్నెకోరియున్నదిరా । ఓరోరిజాణా । బాలనిన్నెకోరియున్నదిరా । బాలనిన్నెకోరికస్తై । బాళిగొన్నది । జాలమేలర॥బా॥

౧. యెల్లమందునీదుసుగుణ । మెల్లదలచిదలచిమదిని । తల్లడిల్లుచుండెగుండెఝల్లుమనగ । చల్లనియీవెన్నెలలో । మల్లెపూలపాన్పుపైని అల్లిబిల్లికనివేగ । కొల్లగానునిన్నుగూడ॥ బా॥

౨. కాళ్లకంటెల్కడియాలుతుమ్మ । కాయగొలుసుల్ । పావడాల్।వేళ్లమట్టెల్బెట్టినాదీవేడుకమీరా । తెల్లగళ్లచీరెగట్టి । తీకామఖమల్ రవికెదొడగి । పల్లవాస్త్రకేళినీదు । యుల్లమలర జేయుటకు॥

౩. కరమునాల్గువేళ్లకును । మరయుచునురతాన్నాలవుంగరముల్। బెట్టుకొనినెంతో । ఘనమగలుబల్ । మురుగులుబోచిలుమేతా। మురుడిగొలుసులుధరియించి । సరసమాడదలచినిపై । విరహవేదనబడుచు ॥ బాల॥

